కవితా ప్రచురణ నెం. 1
ప్రథమ ముద్రణ
అక్టోబర్ 59

★

వెల: 1-50

★

సర్వస్వామ్యములు
గ్రంథకర్తవి

★

సంపాదకులు:
నెప్పల్లి త్రివిక్రమరావు.

★

ముద్రణ:
శ్రీ శారదా ప్రెస్
ప్రకాశం రోడ్డు,
విజయవాడ-2

# నేరము - శిక్ష

[నాటకం]

ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక ఎకాడమీ ఆధ్వర్యాన ఫిబ్రవరి 1959లో హైద్రాబాద్‌లో జరుపబడిన ఆంధ్రనాటక కళాపరిషత్ పోటీలలో కల్పనా థియేటర్స్ విజయవాడ వారిచే ప్రదర్శింపబడి, ఉత్తమ రచనగా బహుమతి పొందిన నాటకం.



కవితా ప్రచురణ

# పాత్రలు

—(౦)—

| | | |
|---|---|---|
| రాజశేఖర్ — | యువకుడు, విద్యార్థి | 22 సం॥ |
| జగన్నాథం — | సి. ఐడి. ఇన్‌స్పెక్టర్ | 35 |
| రమణారావు — | రాజశేఖర్ మిత్రుడు | 24 |
| సాంబయ్య — | లోకల్ బోర్డు ప్రెసిడెంట్ | 48 |
| నారాయణరావు — | కల్పన తండ్రి | 40 |
| కాబూలీఖాన్ — | వృద్ధ కాబూలీ | 55 |
| ఆచారి — | సత్రంగదిలో అద్దెకుండే -వైలనిస్టు | 30 |
| పోలయ్య — | సత్రం జవాను | 40 |
| సత్రంగుమాస్తా — | వృద్ధ గుమాస్తా | 45 |
| వీరభద్రయ్య — | కాబూలీవాడి బ్రోకర్ | 35 |
| వర్కర్ సూరన్న — | సత్రం గదుల్లో అద్దెకుండే -ఓ వర్కర్ | 26 |
| కల్పన — | నారాయణరావు -మొదటి భార్య కుమార్తె | 17 |
| శాంతమ్మ — | రాజశేఖర్ తల్లి | 40 |
| చిట్టి — | నారాయణరావు -రెండవ భార్య కూతురు | 6 |

ప్రథమ పర్యాయముగ 1959 ఫిబ్రవరి 6వ తేదీన, హైదరాబాద్‌లో జరుపబడిన ఆంధ్ర నాటక కళాపరిషత్‌లో పాల్గొనిన నాటి నటీ నటవర్గము.

రాజశేఖర్ : శ్రీ యం. యస్. మూర్తి

జగన్నాథం : శ్రీ పి. రామచంద్ర కాశ్యప్

రమణారావు : శ్రీ యం. వి. చలపతిరావు

సాంబయ్య : శ్రీ వి. రామన్న పంతులు

నారాయణరావు : శ్రీ కె. లక్ష్మీనరసయ్య

కాబూలీఖాన్ : శ్రీ జె. క్రిష్ణమూర్తి

ఆచారి : శ్రీ ప్రభాకరరావు

పోలయ్య . శ్రీ యం. శీతారామశాస్త్రి

సత్రంగుమాస్తా: శ్రీ వేపా సూర్యనారాయణ

వీరభద్రయ్య : శ్రీ శ్రీనివాసరావు

వర్కర్ సూరన్న: శ్రీ హనుమంతరావు

కల్పన : రాధాకుమారి [విజయనగరం]

శాంతమ్మ : శ్రీమతి ఆర్. నిర్మల [మద్రాస్]

చిట్టి : బేబీ సువర్ణ

—o—

# కృతజ్ఞత

ప్రఖ్యాత రష్యన్ రచయిత డోస్టవస్కీ వ్రాసిన 'క్రైం అండ్ పనిష్‌మెంట్' నవలను తెలుగులోనికి అనువదించానని విని మిత్రుడు శ్రీ వెంపటి రాధాకృష్ణ దానిని నాటకంగా చెయ్యమని నన్ను ప్రోత్సహించి, అది ప్రారంభించేవరకు నాకు ఊపిరి సలపనివ్వలేదు. అతను నాకిచ్చిన ప్రోత్సాహానికి, అనేక ఇతర అమూల్య సలహాలకి అతనికి నా కృతజ్ఞత.

నాటకరచన తయారయ్యేక, ప్రదర్శిస్తానని మాట యిచ్చి ఆ మాటను నిలబెట్టుకునేందుకు అనేక వ్యయప్రయాసలను, కష్టనిష్ఠూరాలను భరించిన, నటుడు మాట విలువ నెరిగిన మిత్రుడు శ్రీ యం. యస్. మూర్తికీ, వచ్చిన ఇబ్బందుల నన్నిటినీ పట్టుదలతో అధిగమించి తమ పాత్రలను అత్యుత్తమంగా పోషించుకున్న నటీ నటవర్గాని కంతకూ, రంగాలంకరణలోను, పర్యవేక్షణలోను తోడ్పడిన మిత్రులు శ్రీ జి. వి. కృష్ణారావు, పి. బి. తిలక్ లకు, శ్రమైనా శ్రమను కోక మద్రాస్, విజయనగరాలనుండి వచ్చి ప్రదర్శనకు తోడ్పడిన నటీమణులు శ్రీమతి నిర్మల, రాధాకుమారి గార్లకు నేను ఎంతైనా కృతజ్ఞుణ్ణి.

నాటకం రిహార్సల్సు దశలో వుండగనే చూచి, ప్రచురించాలనే కోరిక వెలిబుచ్చిన శ్రీ త్రివిక్రమరావుగారికి అనేక ఇతర అమూల్య సలహాలిచ్చిన సహృదయులైన మిత్రులకీ, విమర్శకులకీ, నా కృతజ్ఞత.

'—శివం'

# ప్రదర్శకులకు ఒకమాట

నాటకం అంతా సత్రంలో జరుగుతుంది. ప్రేక్షకులకు ఎడమవైపున రాజు గది కన్పిస్తూంటుంది. కుడివైపున బయటనుంచి హాలులోనికి వచ్చే త్రోవ వుంటుంది. హాలులోనుంచి తిన్నగా సత్రంలోని వెనుక గదుల్లోనికి వెళ్ళే త్రోవ వకటి వుంటుంది. బయటి త్రోవకి కొంచెం వెనకే, అంటే రాజు గది గుమ్మానికి ఇంచు మించు ఎదురుగా కల్పన గది గుమ్మం కన్పిస్తూంటుంది. కల్పన గది గుమ్మానికి మరి కొంచెం వెనక సత్రం పైభాగానికి పోయే మెట్లు వుంటాయి అ మెట్లుకూడా దాటితే సత్రం వెనక గదుల్లోకి వెళ్లేత్రోవ. అచారి వర్కర్ సూరన్న ఈ త్రోవకుండానే లోపల్నించి హాల్లోకి వచ్చి బయటికి పోతూంటారు. అంటే స్టేజీలో మూడొంతులు రాజు గది-వకపంటు మిగతా భాగం.

రాజుగదికి, ప్రేక్షకులకు ఎడంపక్కన ఓ కిటికీ వుంటుంది. రాజుగదిలో హాలుకు మధ్య ఓ 'ఇమేజనరీ' గోడ వుంటుంది. ఆగోడ వున్నట్లు 'సజస్టివ్'గ చూపితే చాలు. నటీనటులు మాత్రం హాల్లో వున్నప్పుడు తిన్నగా గదిలో వున్న పాత్రలను చూడకుండా వుండడం, గదిలోవున్న పాత్రలు హాల్లో వున్న పాత్రలను సూటిగాను చూడకుండా వుండడం అవసరం. మధ్యే గోడవుంది కనక ఒకళ్ళ కొకరు కన్పించనట్లే నటించాలి.

రాజుగదిలో చిన్న టేబిలు, కొన్ని పుస్తకాలు, ఓ 'ఈజీఛైర్' రెండు స్టూలు బల్లలు, ఓ మడత మంచం, చిన్న దీపంబుడ్డి వుంటే చాలు. మంచం 'ఇమే జనరీ' గోడని ఆన్చివేస్తే, నటీనటులు పొరపాటున కూడా గోడ దాటే ప్రయత్నాన్ని అరికట్టవచ్చును,

నాటకంలో కల్పనకు భాగవతంలోని పద్యాలు కొన్ని వున్నాయి పద్యాలున్నాయికదా అని వాటిని ఎక్కువ రాగయుక్తంగా చదవకూడదు. ఇంట్లో చదువుకునే పద్ధతిలో భావయుక్తంగా మధురంగా చదవాలి.

లైటింగ్ చాలా జాగ్రత్తగ "పెర్ఫెక్టు"గ వుపయోగించ గల్గితేనే ప్రదర్శకులు వుపయోగించాలి. లేకపోతే ఎఫెక్ట్సు లేకుండానే ప్రదర్శించడం మంచిది.

రచయిత వద్దనుంచి లిఖితపూర్వకమైన అనుమతి లేనిదే ఎవ్వరూ దీనిని ప్రదర్శించరాదని హెచ్చరిక. ప్రదర్శకులకు సందేహాలేమైనా వస్తే రచయితకి C/O "కవితా పబ్లికేషన్స్, విజయవా/డ-2 అని వ్రాసి తీర్చుకోవచ్చును.

—రచయిత.

# మా మాట!

కవితా ప్రచురణల్లో 17వ దిగా శ్రీ 'శివం' గారి "నేరము - శిక్ష" నాటకంను తెనుగు పాఠకలోకానికి అందజేయ గలిగినందులకు సంతసిస్తున్నాం.

మా కోరిక అంగీకరించి "నేరము - శిక్ష" ను ప్రచురించుటకు అవకాశమిచ్చిన శ్రీ 'శివం' గారికి మా కృతజ్ఞతాభి వందనములు.

ఇంతకుముందు మా యితర ప్రచురణాలను ఆదరించినట్లే పాఠకులు "నేరము-శిక్ష"ను కూడా ఆదరిస్తారని నమ్ము తున్నాం.

నాటక ప్రచురణ మాకు ఇది తొలిప్రయత్నం. ఇంకా యిటువంటి ఉత్తమ నాటకాల్ని ఇంకా ఎక్కువగా ప్రచు రించాలని మా అభిలాష. అందుకు ఆంధ్ర రచయిత, పఠితల సహకారం మాకు పూర్తిగా లభిస్తుందని ఆశిస్తున్నాం.

ఈ పుస్తకాన్ని ముచ్చటగా ముద్రించిన శ్రీ శారదా ప్రెస్ అధిపతులకు మా ధన్యవాదాలు.

—ప్రకాశకులు,

# నేరము - శిక్ష

## [ నా ట కం ]

## ఒ క టవ రం గ ము

[ పాడుపడిన దెయ్యాలకొంపలా వున్న సత్రంలో క్రింది భాగం. తెర లేచేసరికి పైనుండి వ్రేలాడే బూజుతో, సున్నాలులేని గోడలతో, అందులో నివశించేవారి బాధల్ని, దారిద్ర్యాన్ని ప్రతిబింబిస్తూ ఘోరంగా వుంటుంది వాతావరణం. దీనికితోడు కన్పించీ కన్పించని మసకవెలుగులో నీడలు కదుల్తూ వుంటాయి. లోపల్నించి "నీడలు—నీడలు" అనే పాట వైలన్ మీద ఎవరో విషాదంగా సాధన చేస్తుంటారు. ఎదురుగా ఎడమవైపున కన్పించేది గది. కుడివైపుది హాలులోని బాగం. ఎడమవైపు గది తలుపులు మూసి వుండటంవల్ల మరీ చీకట్లో వుంటుందాగది. లోపల ఎక్కడో దీపం వెల్గించి నందువల్ల, సన్నటి వెలుగొచ్చి హాలులో పడ్తుంది. కల్పన కుడివైపుననున్న తన వాటాముందు కూర్చుని "భాగవతం" వంక తదేక ధ్యానంగాచూసి, నిట్టూర్చి, చదవనారంభిస్తుంది.

పద్యం:—ఎవ్వనిచేజయించు జగమెవ్వని లోపలనుండు లీనమై,
యెవ్వని యందుడిందు పరమేశ్వరుడెవ్వడు, మూలకారణం
బెవ్వడనాధి మధ్యలయుడెవ్వడు, సర్వము దానయైనవా
డెవ్వడు, వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్॥

పద్యం చదవగానే కుడివైపు గది లోపల్నించి "అమ్మా! ఆకలే! అన్నం పెట్టవే త్వరగా" అంటూ చిట్టి మారాము, ఆ వెనకే చిట్టిని ఎవరో తిడుతూ దబ దబ రెండు వాయించినధ్వని. కల్పన భాగవతాన్ని మూసేసి, లేచి గది లోపలకెళ్ళి, వెంటనే చిట్టిని ఓదారుస్తూ తిరిగి ప్రవేశిస్తుంది. ]

కల్పన:– మా బంగారు తల్లివికదూ, వూరుకో.

చిట్టి:– (వెక్కి వెక్కి ఏడుస్తూ) మరే, నన్ను–అమ్మ ఎందుకు కొట్టింది ?

కల్పన:– అల్లరి చేయకూడదు అమ్మా! బంగారు తల్లులు ఎక్కడైనా అల్లరిచేస్తారా ?

చిట్టి:– అల్లరి చేయలేదక్కా! ఆకలేస్తోంది అన్నంపెట్టమన్నా.

కల్పన:– అమ్మకి ఒంట్లో బావుండ లేదుకదా; అస్తమానం "అన్నం–అన్నం" అంటే ఎట్లా అమ్మా! కాసేపు ఆ సందులో వాళ్ళ బాబుతో ఆడుకుంటే, అన్నం వుడకగానే పిల్చి పెట్టేస్తాగా !

చిట్టి:– తొందరగా పిలుస్తావా మరి ?

కల్పన:– –ఓ తొందరగానే పిలుస్తాగా.

చిట్టి:– అక్కా. ( వెళ్లబోతూ ) నాన్నగారేరే ?

కల్పన:– ఎక్కడికో పనిమీద వెళ్లారమ్మా. వస్తారు. నువ్వు కాసేపు ఆడుకో మరి. నేను అన్నం దించేసి పిలుస్తా.

చిట్టి:– తొందరగా పిలవాలి! ఏం ? (ఆగి) అక్కా చీకట్లో నాకు భయంగా వుందే !

కల్పన:– భయమేమిటమ్మా? నేనువచ్చి దిగబెడతానుండు.

[ లోపల వైలన్ ఆగిపోతుంది. కల్పన చిట్టితో సందు లోపలకి వెళ్ళు తుంది. ఇంతలో సన్నగా పొడుగ్గావున్న ఆచారి గుండీలు పెట్టుకుంటూ హాల్లోకి వచ్చి బయటకు వెళ్ళబోతూ, లోపలికి వస్తూన్న సత్ర గుమాస్తాను చూసి, వెనక్కి అడుగువేసి ]

ఆచారి:– చచ్చాన్రా దేవుడా !

స॥ గు:– ఏమయ్యా ! రెండో నెల గడుస్తోందికదా. అద్దె ఏమన్నా ఇచ్చే ఆలోచనుందా ?

ఆచారి:- క్రిందటినెలే ఇచ్చేవాణ్ణి రామయ్యోబాబూ ! ఆ షావుకారుగారు ట్యూషన్ జీతం యిప్పటివరకు 'అదుగో ఇదుగో' అంటున్నారు. అంచేత........

స॥ గు:- అంచేత యించేత. యిదంతా నాకెందుకయ్యా ! అయినా "వాళ్ళియ్యలేదు, వీళ్ళియ్యలేదు" అంటూ యింటద్దె ఎగ్గొట్టేస్తే, అవతల కౌన్సిలుబాబు నా పీక వత్తేయ్యడటయ్యా !

ఆచారి:- ఈ సారి ఒక్కసారే-ఆలస్యమయిపోయింది. మీరు కాస్త మమ్మల్ని కనిపెట్టకపోతే........

స॥ గు:- అదిగో మళ్ళీ ఆమాటంటూ వేమిటయ్యా ఆచారయ్యా. ఈ నెల ఒక్కనెలేనా నువ్వు ఆలస్యం చేస్త ! ఆమాట కొస్తే ఏ నెల సరీగా యిచ్చేవంట ? ఆఁ ! అడిగితే అడిగేసనే నిందా ! అడక్కపోతే అయిపులేకుండా పోవటమా? ఇదేనయ్యా పెద్దమనుష్యుల వ్యవహారం !

[ ముక్కుపొడి డబ్బా ఆచారిది లాక్కుంటాడు ]

ఆచారి:- మీరు కోప్పడితే మరి మాట్లాడలేను. వారం రోజుల్లో ఎక్కడో అక్కడచూసి సర్దేస్తాగా.

స॥ గు:- మళ్ళీ వారం అంటావేమయ్యా? నీతో మాలావు చిక్కొచ్చిపడిందే ! ఇదిగో ఆఖరుసారిగా చెబ్తున్నా. షావుకారు నీ బాకి యిచ్చేది-చచ్చేది. నువ్వుమాత్రం నీ రెండు నెల్ల బాకీ ఎల్లుండిలోగా యివ్వకపోతేమాత్రం నీ పరువు దక్కదు. అయినా అస్తమానం ఆ గదిలో కూచుని కుయ్యో మొయ్యో అని ఫిడేలు వాయించక పోతే షావుకారింటికెళ్ళి బాకీ అడగకూడదటయ్యా?

అసలు నీలాంటివాళ్ళకి అద్దెల కివ్వడం నా దితప్పు లేవయ్యా !

ఆచారి:- అమ్మమ్మ! అంతమాటసకండి. యిప్పుడే పావ్వుకాపు గారింటికెళ్ళి బాకీ అడుగుతా చూడండి. (ముక్కుపొడి డబ్బా తిరిగి లాక్కుంటాడు)

[ చర చరా బయటకి వెళ్ళిపోతాడు ఆచారి! సత్రం గుమాస్తా ఓసారి ముక్కుపొడుం పీల్చి, రాజు గదివైపు చూసి, ముందుకు వెళ్ళబోతూ ఏదో అడుగుల చప్పుడు విని, మెట్లదగ్గర నక్కుతాడు. కల్పన హడావుడిగా వెనక నుంచి పరుగెత్తుకొస్తుంది. వెనకాలే సూరన్న వస్తాడు. కల్పన చటాలున ఆగి దీనంగా సూరన్నతో ]

కల్పన:- నీకు దణ్ణంపెడతా. నన్ను గుట్టుగా బతకనియ్యి.

సూరన్న:- అదికాదు కల్పనా...నీతో కాస్త రహస్యంగా మాట్లాడాలి. అట్లా భయపడతావేం! ఓసారి యిటురా.

కల్పన:- నాకే రహస్యమూ అక్కరలేదు. నా మానాన నన్నొదిలెయ్యి.

సూర:- నేనెవరితోనయినా చెబుతాననుకుంటున్నావా ?

కల్పన:- ( మాట్లాడదు )

సూర:- అయితే నేను మోసం చేస్తానను కుంటున్నావా. ఇదిగో యీ అయిదు రూపాయిలు దగ్గరుంచుకో ( నోటును చాస్తాడు ముందుకు )

కల్పన:- ( వెనక్కి జరిగి ) వూహు !

సూర:- నువ్వీమధ్య చీకటిపడ్డాక, రోజూ ఎక్కడికి వెళ్తున్నావో నాకు తెలుసులే. ( మృదువుగా ) నిన్ను చూస్తుంటే నాకు మతి పోతూంది. ఇదిగో, యిది తీసుకో. మీ అమ్మకి మందుకయినా పనికివస్తుంది. నేనెవరి

తోనూ చెప్పనులే. (ఐదు రూపాయిల కాగితాన్ని బలవంతాన చేతిలో వుంచుతాడు. సత్రం గమాస్తా యిదిచూసి ముందుకు వస్తాడు. సూరన్న యిది గమనించి ఏమీ జరగనట్లు ముఖంపెట్టి బయటకు వెళ్ళబోతాడు. కల్పన స్తబ్ధులా సిగ్గుతో తల వాల్చుకుని నిలబడిపోతుంది.)

స॥గు:- ఏం సూరన్నా! ఈ మధ్య సంపాదన జోరుగా ఉన్నట్లుందే!

సూర:- హుఁ! (అని వెళ్లిపోతాడు బయటికి)

స॥ గు:- ఇది పెద్దమనుష్యులుండే స్థలమని మర్చిపోతే ఎట్లా తల్లీ! ఇక్కడ యిట్లాంటి వేషాలేస్తే ఆ కౌన్స్లెరుబాబు మధ్య నాపీక వత్తేస్తాడు, తెలుసా? మళ్ళీ కనక యిట్లాంటి వ్యవహారాలు నా కంటబడితే వాటా-వాటా ఖాళీచేయించేస్తాను. ఆఁ! ఆనక నన్నని ఏంలాభం లేదు. అయినా మీ నాయన ఏడమ్మా! ఎప్పుడు చూసినా కన్పించడు-ఆ దేవుడు. తాగి తందనాలు తొక్కడానికిమాత్రం ఏపూటకాపూట చేతినిండా వుంటాయి డబ్బులు. అద్దెబాకీ యివ్వటానికిమాత్రం కానీవుండదు ఆ మారాజుదగ్గిర. మీ అందరికి ఓ నమస్కారంగానీ, ఆయన రాగానే వాటా ఖాళీ చేయించమని చెప్పమ్మా. ఈయనచూస్తే అద్దె యివ్వడు. ఆకౌన్స్లెరు బాబుచూస్తే నా పీక వత్తేయకుండా వూరుకోడు.

కల్పన:- కోప్పడకండి అన్నగారూ. నాలుగయిదు రోజుల్లో బాకీ అంతా తీర్చేస్తాం.

స॥గు:- ఎన్నాళ్ళమ్మా యిట్లా రేపూ ఎల్లుండీ అని. అయినా వున్న ఆ వుద్యోగం కాస్తా పోగొట్టుకున్న దేవుడు, 40 రూపాయిలు నాలుగు రోజుల్లో ఎట్లా తీసుకొస్తాడమ్మా! అదంతా నాకెందుకుగాని, నాలుగు రోజుల్లో అద్దె యివ్వకపోతే ఆనక ఆబోరు దక్కదని చెప్పమ్మా! (రాజు గదివైపుచూసి) ఈ అబ్బాయొకడు! ఎప్పుడు చూసినా వుండడు. గది ఖాళీ చెయ్యమంటే అదీ చెయ్యడు. పొద్దున్నే పోలీసురిపోర్టు యిచ్చేసి వచ్చాలే. జలుబు వదిలిపోతుంది.

[ మేడమెట్లు నెక్కి పైకి వెళ్ళిపోతాడు సత్రం గుమస్తా. ఇంత వరకు వీధి గుమ్మంవద్ద ఆగి ఇదంతా వింటున్న నారాయణరావు కొద్దిగా తూలుకుంటూ నెమ్మదిగా హాల్లోకి వస్తాడు. కల్పన చటాలున 5 రూపాయిల కాగితాన్ని పుస్తకంలో దాస్తుంది. నారాయణరావు ఇది గమనించికూడా గమనించనట్లే నటిస్తూ, ]

నారా:- ( మత్తుగానే ) అమ్మకి ఎట్లా ఉందమ్మా ?

కల్పన:- అట్లానే ఉంది నాన్నా !

నారా:- ( భయంతోనే ) మీ అమ్మ లేచిందా ?

కల్పన:- లేదునాన్నా. . .అట్లానే పడుకొనివుంది. దగ్గుకుతోడు నిన్నటినుంచి విపరీతంగా ఆయాసమొస్తోంది. ఆఖరికి నిన్న ఎట్లానైతేనేం డాక్టరుగారు చెప్పిన మందులు కొనితీసుకొచ్చేను.

నారా:- మందులు నువ్వుకొని తెచ్చావా తల్లీ ?

కల్పన:- ( తల వూపుతుంది )

నారా:- (లజ్జతో) ఇంట్లో చెట్టంతమగాణ్ణి వుండి కూడా ఎందుకూ కొరగాకుండాపోయే. ఇక ఈ జన్మ ఇలా వెళ్ళిపోవలసిందే. వచ్చే జన్మలోనైనా నీ కడుపునపుట్టి నీ ఋణం తీర్చుకోగల్గితే ..(కూలబడతాడు)

[ రాజు బయటనుంచి తల వంచుకుని ఏదో ఆలోచిస్తూ లోపలకు వస్తాడు. ఆతని దుస్తులు మాసివుంటాయి. గదిలోకి వచ్చి కిటికీ తెరుస్తాడు. కొవ్వొత్తి వెలిగించి కుర్చీలో కూలబడతాడు. హాలులో కల్పనకి, నారాయణకి మధ్య జరిగే సంభాషణ వింటాడు.]

కల్పన:- లే నాన్నా, లోపలికిరా.

నారా:- నేను వట్టి పశువును తల్లీ. చేసిన పాపాలన్నిటికి ఈ జన్మలోనే శిక్ష ననుభవిస్తున్నా. నీ రాత చూస్తూ జీవచ్ఛంలా యింకా యిట్లా బ్రతికివున్నా! నన్నే దేవుడు క్షమిస్తాడమ్మా? ఆఖరికి నువ్వు-నువ్వైనా-?

కల్పన:- ముందు మీరు లేవండి నాన్నా. ఊఁ! మళ్ళీ మీరు దుకాణానికి వెళ్లారా నాన్నా?

నారా:- బుద్ధి గడ్డితిని వెళ్లానమ్మా. ఇంకెప్పుడూ ఆ పాడు తాగుడు జోలికి పోనమ్మా.

కల్పన:- లోపలికి నడు నాన్నా.

నారా:- పద తల్లీ పద.

[ ఇద్దరూ హాలు వెనకకి వెళ్తారు. సీరియస్‌గ లేచి గదిలో ఓసారి అటు ఇటు తిరిగి ఓ పుస్తకం తీసుకొని చదవబోతాడు, కాని సాగదు. పుస్తకాన్ని బల్లపైన పడవేసి ఏదో రాయబోతాడు, కాని సాగదు. పెన్సిలును బల్లపైన పడవేసి తిరిగి కుర్చీలో కూలబడతాడు. లోపల్నుంచి రకరకాల రణగొణ ధ్వనులు, వీటన్నింటిని మించిన పోలయ్య కంఠస్వరం—

కుదరదు బాబూ, కుదరదు. రేపుచూద్దాం. ఎందుకంటే ఏంచెప్పేది యిమ్యేళ నేను సినిమాకి వెళ్తున్నా"

రాజు నవ్వుకుని మళ్ళీ బల్లమీద పుస్తకాన్ని తీసుకుని చూస్తుంటాడు. పోలయ్య హాల్లోంచి రాజు గదిలోకి వచ్చి, ]

పోల:- బాబుగారూ! కాఫీ తెచ్చిపెట్టేదా ?

రాజు:- (విషాదంగా నవ్వి) కాఫీ ఆ ? రోజూ మనకి అప్పేవరిస్తార్రా ? వద్దులే.

పోల:- అదేంటి బాబూ! భోజనం మానేసి, కాఫీ కూడా మానేస్తే ఎట్టా ? ఆ అయ్యరుగాడేదో అన్నాడని కాఫీ మానేస్తామా. నే తెస్తా వుండండి...గ్లాసేది ?

రాజు:- (శూన్యంలోకి చూస్తూ) చూడు. ఎక్కడో వుంటుంది. వాడు డబ్బడిగితే, రెండు మూడు రోజుల్లో యిచ్చేస్తామని చెప్పు.

పోల:- అదంతా నాను చూసుకుంటాగా బాబూ !
(గ్లాసు దొరుకుతుంది. తీసుకుని ఏదో ఆలోచనవచ్చి ఆగి) బాబూ ! పిల్లలకి పాటాలు సెప్పడం కూడా మానేసేరేం ? అయ్యాయినా వుంటే ఏదో నాలుగు రాళ్ళొచ్చేయిగా ?

రాజు:- ఆఁ...ట్యూషన్లా ? అంతకంటే మరో ముఖ్యమైన పని చేస్తున్నాలే !

పోల:- (ఆగి) అదేది బాబు ?

రాజు:- ఆలోచన్రా—ఆలోచన !

పోల:- ఏంటో ఎర్రిబాబులు ! ఆలోచన్లు కూడెడతాయూ బాబూ ?

రాజు:- పాఠాలవల్ల ఏమొస్తుందిరా...పదిరూపాయలుకూడా

రావు.

పోలః- కాకపోతే వక్క-సారిగా లచ్చరూపాయలు వచ్చి పడతాయా బాబు ?

రాజుః- ఎందుకు రావురా ?

[ పోలయ్య రాజుని విచిత్రంగాచూచి గ్లాసుతో బయటికి వెళ్ళి పోతాడు. రాజు ఆలోచనతో తన గదిలో అటు యిటు కాస్సేపు తిరిగి ఆగి ఒక్క డక్కన్ సిగరెట్ ముట్టిస్తాడు. మళ్ళీ తిరుగుతుంటాడు. ఇంతలో దగ్గుకుంటూ ఓ 55 ఏళ్ళ వయస్సుగల వృద్ధకాబూలీ హాల్లోకి ప్రవేశిస్తాడు. వెనకాలే చిరిగిన దుస్తులతో బ్రోకర్ వీరభద్రం వుంటాడు. ]

కాబూలీః- (అటూ యిటూ చూసి వీరభద్రంతో) ఎక్క-డరా ఆడు వుండేది ?

వీర :- ఆ లోపలసాబ్.

కాబూః- లోపల్కి-హెవడ్ పోతాడ్...వుస్కో- బులావ్.

వీర :- చిత్తం. (నాలుగడుగులు ముందుకువేసి) అయ్యా ! నారాయణరావుగారూ !

కాబూః- 'హయ్య' ఏంటిరా - బాకీవాడ్కి-. అరే బోలో.

వీర :- నారాయణరావుగారూ! వోసారిట్లా రండి.

[నారాయణరావు నెమ్మదిగా హాల్లోకివచ్చి కాబూలీని చూసి ఆగిపోతాడు. ]

కాబూః- (వీరభద్రంతో) హాడ్కి-పూఛో ! డబ్బు హెప్డు యిస్తుంది ?

నారాః- చాలా అవస్థలోవున్నా పఠాన్‌సాబ్ ! ఒచ్చే నెలలో వున్నవన్నీ అమ్మేసయినాసరే బాకీ తీర్చేస్తా?

కాబూ:- హీట్లా హెన్నాళ్ళు సెప్తుంది......నీకీ కోర్టునే హెక్కించాలిక్యా ?

నారా:- కోర్టువరకు ఎందుకుసాబ్, నేనే స్వయంగా ఇచ్చేస్తా. చాలా యిబ్బందుల్లోవున్నా. మీరు కాస్త కనికరించకపోతే...

కాబూ:- కన్కరించడం, గిన్కరించడం – మనకి మాలూంనై. డబ్బు హిప్డు హిస్తావ్, ఔర్ చస్తావ్ ? ఎవడి బాబ్కా డబ్బనుకుండావ్ ? నాకి డబ్బిస్తేనే హిక్కడ్నించి జరిగేది.

నారా:- కోప్పడకండి.

కాబూ:- క్యా ! ...నీకీ అన్నం తింటంలేదూ ? డబ్బడిగితే గుస్సా క్యాబోల్తా ? డబ్బా నీకీ యిస్తుంది, నీ బాబు యిస్తుంది సూస్తా. లావ్ జే లావ్.

నారా:- మీరు నన్ను నరికేసినా నాదగ్గిరిపుడు పైసా లేదు. వచ్చే నెలలో వున్నవన్నీ అమ్మేసి...

కాబూ:- హిప్డు అమ్ము–వచ్చేనెల హెందుకు ? హమ్మేసి బాకీ యిచ్చేయి. పోతాం. హెందుకు మమ్మల్ని తిప్పుతావ్ ? నీకీ సిగ్గులేదు ? మనిషికాదూ? బుద్ధిలేదూ?

నారా:- వచ్చేనెలలో ఎల్లాగోలాగ తప్పక యిచ్చేస్తా. నా సంగతి వీరభద్రంగారికి బాగా తెలుసు, అడగండి.

కాబూ:- హోడ్కీ, హీండ్కీ, ఫూఛ్‌నే బాత్ కోయీనై! వచ్చే నెల హిస్తాడుట. మాకీ పెళ్లాం బిడ్డల్కి వదుల్కొని హింతదూరంవచ్చి గడ్డితిని బత్కుతాం అన్కుంటావ్. వచ్చేనెలమే హిస్తాడుట. నీకీముక్కు మాకు తెలుసూ!

నీదీ మొహాం మాకూ తెలుసూ? హేదీ తెలియకుండా నీకీ డబ్బు అప్పు హిచ్చినందుకు హిది మాకీ సిచ్చావా? పాణం పోతోందని 50 రూపాయిలు తీసుకొని హెళ్ళి హెన్నాళ్ళయింది మాలూం! ఏక్ సాల్ పర్ తీన్ మహినే! వారం రోజుల్లో పూరా బాకీ హియ్యక పోతే సూస్కో మజా. నీకీ మట్టితిన్పిస్తాం...మట్టి.

[ ఇంతలో సత్రం గుమాస్తా పైనుంచి మెట్లమీదికి వచ్చి ]

స.గు:- పఠాన్ గారా! ఏమిటిట్లు దయ చేశారు?

కాబూ:- క్యా బోల్నా! మాకీ బుద్ధి గడ్డితిని అలగాలోగ్ కి బాకీ హిచ్చేం! హిచ్చేక తిర్గలేక సచ్చిపోతుండాం. క్యా బోల్నా?

స.గు:- ఓ నారాయణరావుగారే కదా? ఫర్వాలే! ఆయనకి వుద్యోగం పోయినా యీ మధ్య యింట్లో సంపాదన బాగానే సాగుతోందే! (నారాయణరావు తల వంచుకుంటాడు) ఒకటో తారీఖు దగ్గరపడ్తోంది. మా సంగతి కూడా కాస్త గుర్తుంచుకోండి...వస్తా.

[ నవ్వి పైకి వెళ్ళిపోతాడు. ]

కాబూ:- (వీరభద్రంతో) నడువ్ బే - హేంటి చూస్తావ్? ఆ స్టూడెంట్ గాడ్కి సొమ్ముల్ హిడ్చించుకపొమ్మని బోలో. 3 రోజుల్లో రాకపోతే అమ్మేస్తామని బోలో. జెంటిల్ మన్ లా వచ్చి సొమ్ముల్ పెట్టి పోతార్, మళ్ళీ చూస్తే ఫికర్ వుండర్...ఛూ...ఛూ...

(వీరభద్రాన్ని హంటర్ తో ఒకటి తేలిగ్గా కొట్టి బయటికి వెళ్తాడు కాబూలి. వీరభద్రం వీపు నిమురుకుంటూ రాజు గదిముందు ఆగుతాడు. నారాయణరావు మెమ్మదిగా లోపలికి వెళ్ళిపోతాడు.)

వీర :- రాజశేఖరంగారూ ! రాజశేఖరంగారూ !

రాజు:- (అంతవరకు తలుపు ప్రక్కనే పొంచుండి వింటున్న వాడల్లా ఏమీ ఎరగనట్టే ముందుకువచ్చి) ఓ ! నువ్వా భద్రయ్యా ! బాగున్నావా ?

వీర :- మీ దయవల్ల బాగానే వున్నానండి. (తర్వాత చెప్ప లేక నీళ్ళు నములుతాడు.)

రాజు:- ఏమిటిట్లా వచ్చావూ ?

వీర :- పఠాన్‌గారు యిక్కడికివచ్చి నారాయణరావుగారిని ఝూళించిపోయారు. మీరు విన్లేదా ?

రాజు:- ఏదో చదువుకుంటూ పరధ్యాసంగా వున్నట్లున్నా. ఊఁ!అయితే పఠాన్‌గారు వచ్చారన్నమాట.

వీర :- అవును మీ బాకీసంగతి అడగమన్నారు బాబూ !

రాజు:- ఓ...నా బాకీసంగతా ? దానికేముంది. నాలుగైదు రోజుల్లో వచ్చి, డబ్బిచ్చేసి, వస్తువుల్ని విడిపించేసు కుంటానని చెప్పు. అట్లా విడిపించుకోలేకపోయినా వడ్డీ కట్టేస్తా.

వీర :- పఠాన్‌గారు భలే కోపంగావున్నారు బాబూ ! మీరు రెండు మూడు రోజుల్లో వచ్చి సామాన్లు విడిపించుకోపోతే అమ్మేస్తామని చెప్పమన్నారు. ఎక్క డైనా తెచ్చుకోక, వాడిదగ్గర యెందుకు తెచ్చు కున్నారు బాబూ. వాడొట్టి రాక్షసుడు. దయాదాక్షి ణ్యాలు కలికానికైనా వాడిలో లేవు. వాడి చేతుల్లో యెన్ని సంసారాలు నాశనమైపోయాయో, ఎంత

మంది వాడికిగాథ పడలేక ప్రాణాలు తీసుకున్నారో నాకు తెలుసు బాబూ.

రాజు:- నిజమేనా భద్రయ్యా ?

వీర :- నిజమే బాబూ ! ఒకనాటి వాడిచేతిలో పడితే మళ్ళీ యివతలికి రావడం అంటూ వుండదు. అసలు అసల్లానే వుంటుంది. ఎన్నాళ్ళయినా వడ్డీలే కడ్తుంటాడు. నామాటవిని ఎట్లాగోలాగ డబ్బులు యిచ్చి శాకీ విడిపించేసుకుని, మళ్ళీ అటువైపుకే రాకుండా వుండండి.

రాజు:- (ఆలోచిస్తూ) కొంచెం టైం యిమ్మని నువ్వు చెప్ప కూడదా భద్రయ్యా !

వీర :- ఆయనకి నేను చెప్పడమేనా బాబయ్యా ! నేను నోరెత్తితే యింకేమైనా వుందా ? అయినా ఆలస్య మయినకొద్దీ మీకే నష్టంగదా బాబయ్యా-వడ్డీ పెరిగి పోదూ !

రాజు:- వడ్డీ నేను నెలనెలా కట్టేస్తున్నాగదా...అతనట్లా కష్టంగా మాట్లాడటం ఎందుకు ?

వీర :- ఆయన మీ గడియారాన్ని, వుంగరాన్నీ జాగ్రత్త చేస్తున్నారుగా.

రాజు:- (వీరభద్రం జబ్బ పుచ్చుకుని దీసంగా) అవి మానాన్న గారి వస్తువులు భద్రయ్యా ! వాటిని నే నెంతో ప్రాణప్రదంగా చూసుకుంటున్నా. ఎట్లాగోలాగ త్వరలోనే విడిపించేసుకుంటా...ఒక్క-వారం ఆగమను.

వీర :- (కొంచెం ఆలోచించి) అట్లాగే చెబుతా...కాని నా మాట ఆయన వింటాడనుకోను.

రాజు :– అది సరేగాని భద్రయ్యా! నువ్వు బాకీ వసూలు చెయ్యలేదని ఆ రాక్షసుడు నిన్ను అప్పుడప్పుడు కొడుతుంటాడుట నిజమేనా ?

వీర :– అన్నంపెట్టే మా రాజు కొట్టడా బాబు! అదంతా ఎందుకు పోనిస్తురూ! నే నింకా అగ్రహారం వెళ్లాలి సెలవిప్పించండి.

రాజు:– అగ్రహారమా? ఈ చీకట్లో అంత దూరం ఎందుకు ?

వీర :– ఓ పంతులుగారు బాకీవున్నారులెండి. ఆయన్ని కలుసుకోవాలి...మరి వస్తాబాబు.

[వీరభద్రం నమస్కరించి వెళ్ళిపోతాడు! రాజు గదిలో అటూ యిటూ తిరుగుతూ, "రాక్షసుడు - దుర్మార్గుడు" అని గొణుగుతూ పళ్ళుకొరుకుతాడు. పోలయ్య కాఫీగ్లాసుతో నెమ్మదిగా లోపలికివచ్చి]

పోల:– ఆడెవరుస్వామీ? (బల్లపైని కాఫీగ్లాసు పెడతాడు)

రాజు:– (పరధ్యానంగా) వాడే. మనుష్యుల పచ్చిరక్తం తాగే కాబూలీ. (ఆగి) ఆఁ...నువ్వా పోలయ్యా! కాఫీ తెచ్చావా ?

పోల:– అదిగో. మరింక తెల్లారే కన్పించడం. యింకేమైనా కావలిస్తే యిప్పుడే చెప్పేయండి.

రాజు:– అదేం పోలయ్యా! ఎక్కడికెళ్తున్నావ్ ?

పోల:– (సిగ్గుతో) చినిమాకెడుతుండా బాబయ్యా.

రాజు:– నువ్వు సినిమాలకెళ్తావా పోలయ్యా ?

పోల:– ఈరోజుల్లో ముందు సినిమాలేకద బాబయ్యా! తర్వాత కూటి సంగతి.

రాజు:– అది సరేగాని...నువ్వు సినిమాకెళ్ళితే నీకు గేటు తలుపు ఎవరు తీస్తారు పోలయ్యా !

పోల:- ఎవరు తీస్తారు బాబయ్యా ? నేను వచ్చేవరకు తీసే వుంటుంది. మరి వస్తాబాబయ్యా.

[పోలయ్య మేడపైకి వెళతాడు. రాజు లేచి ఆలోచిస్తూ కాఫీగ్లాసు తీసుకుంటాడు. వీధిలోంచి వర్కర్ సూరన్న, ఆచారి లోపలికొస్తారు- ఏదో మాట్లాడుకుంటూ.]

సూరన్న:- ఎధవ! రోడ్డుమీాద నిలబెడతాడంట. ఎధవ ! వడ్డీ తీసుకోవడంలేదా అంట.

ఆచారి:- ముందు ఎక్కడో తలన్నా తాకట్టుపెట్టి ఆ బాకీ తీర్చేద్దూ. ఆ కాబూలీతో చెలగాటమంటే పాముతో చెలగాటం తెలుసా ?

సూర:- ఆఁ ! పాముతో చెలగాటం. నా సంగతి తెలియదు కావల్ను. అదిసరేగాని మంచివాళ్ళంతా యిట్టె సచ్చిపోతారుగాని ఇట్టాంటివాళ్ళు ఎప్పటికీ చావరేం ఆచారన్నా ?

ఆచారి:- దేనికైనా టైంరావాలిగాని, నువ్వు చావమంటే చస్తారటయ్యా ?

సూర:- సావకపోతే సచ్చేట్లు ఎవడోవకడు సావబాత్తాడు. దాంతో పీడ వదిలిపోతుంది. ఎదవది, రోజూ తెల్లార కుండానే యీా ఎదవ కాబూలీముఖం పత్తెక్షం. నా సామిరంగా ! ఎవడోవకడు యీాడ్నట్టుకుని యిరగ పొడిస్తేనా...

ఆచా:- చాల్లే ! వూరుకో; ఎవరైనా వింటే నవ్విపోతారు.

సూర:- నవ్వుతారా ? ఎందుకు ? యీాళ్ళు మనకి అప్పులిచ్చి జలగల్లా మన ప్రాణాల్ని పీల్చేయటంలా ? రూపా

యిచ్చి, మధ్యాహ్నంనించి 5 రూపాయలు గుంజటంలే ? నవ్వుతారంట. ఎందుకు నవ్వుతారంట ? నాదగ్గిరే తుపాకి వుంటేనా-యిట్టాంటి వాళ్ళందర్నీ 'ఢామ్మ'ని పేల్చేయనూ.

ఆచా:- (నవ్వుతాడు)

సూర:- (కోపంగా) ఎందుకంట అట్టా నవ్వుతావు ?

ఆచా:- (నవ్వాపుకుంటూ) నువ్వా ? నువ్వు ! (మళ్ళీ నవ్వి) నువ్వు చంపుతావా ?

సూర:- నేను చంపుతానా ? ధైర్యంవున్న మగాడెవడైనా అన్నానుగాని. (ఆచారి మళ్ళీ నవ్వుతుండగా, రాజు మిత్రుడు రవణ వీధిలోంచి హాల్లోకి ప్రవేసిస్తాడు. ఆచారి నవ్వు నాపుకుని రవణనే చూస్తుంటాడు. రాజుపై సంభాషణ విని గదిలో uneasyగా తిరుగు తుంటాడు.)

రవణ:- (ఆచారితో) రాజశేఖర్ ఉండేదెక్కడో తెలుసా ?

ఆచా:- రాజశేఖరా ? ఓ...రాజుగారా... ఆ గదిలోనే (వర్కర్ తో) చాన్లేరా, పోదాం.

(సూరన్న, ఆచారి లోపలికి వెళ్ళిపోతారు. రవణ, రాజు గది దగ్గర కొచ్చి గుమ్మంలో నిలబడతాడు.)

రాజు:- (ఉలిక్కిపడి) ఎవరిది ?

రవణ:- (తుఫానులాగ లోపలికొస్తూ) నేనోయి రవణని ! ఏమిటి యీ డంజన్లో ఉంటున్నావా ? ఏమిటోయి- ఎట్లావుంటున్నావిక్కడ? మధ్యాహ్నంనుంచి నీ కోసం వూరంతా గాలించేసి ఆఖరికి ఇప్పటికి పట్టుకోగల్గే !

అన్నట్లు నీ ఎడ్రస్ యెట్లా దొరికిందో తెలుసా? అదంతా ఒక పెద్ద కథలే. ఉన్న కళ్లుకూడా పోయే టట్లున్నాయి. ఏమిటా గుడ్డిదీపం? అబ్బా! తిరిగి తిరిగి కాళ్ళుకూడా లాగేస్తున్నాయి. ఏమిటో ఇన్నా ళ్ళకి పాత స్నేహితుడు కన్పించాడుకదా అని కాస్త కాఫీ గట్రా తెప్పించడం, కూర్చోమని మర్యాద చెయ్యడం, ఏమీ లేదుకద! (కూర్చొని) ఛీ! ఈ పాడు కొంపలోతప్ప నీ కెక్కడ గదే దొరక లేదోయి? (ముక్కు-లెగరేస్తూ) ఛీ! ఏమిటో పాడు వాసనేస్తోంది. (సీలింగ్‌వైపు చూస్తూ) Thank God! ఎట్లాగయితేనేం నిన్నాఖరుకు కల్సుకోగల్గాను మళ్ళీ!

రాజు:- సన్నెవరూ కల్సుకోనక్కరలేదు.

రవణ:- (విననట్లే తన ధోరణిలోనే) రోజూ తిండి తింటు న్నావా? అసలు. ఏమిటి అట్లా చిక్కిపోయావు? ట్యూషన్లన్నా వున్నాయా? తిండితోబాటు వాటినీ వొదిలే శావా? (రాజు సమాధానం యివ్వడు. రవణ లేచి వుత్సాహంగా చిటికలేస్తూ) ఛాన్సంటే ఛాన్సుకాదు. క్లాస్ వన్ ఛాన్సు తగిలింది మనకి. తొందరపడకు. చెబుతున్నా...స్వదేశీ ప్రచురణలవాడు లేడూ! వాడు 'అన్నాకెరినీనా' కావాలంటున్నాడు. 'నో, సారీ. వుయ్ ఆర్ టూ బిజీ' అన్నా-నిజంగా 'బిజీ' అనుకోకు. అదో 'పోజ్' అంతే. ఇక వాడు మనల్ని వదల్లేదు. "అర్జంటుగా కావాలిసార్. మీరే అట్లా అంటే యెలా" అన్నాడు. నిజానికి మరోడెవడో

ఆ పుస్తకమే మొదలెట్టి వుంటాడు. అందుకే అంత అర్జంట్. ఎందుకంటే మామూలు సమయాల్లో వాడి దగ్గర్నుంచి పావలాకూడా పిక్కలేం అనుకో. సంగతి గమనించి కాస్త బెట్టు చేసేసరికి పాతికరూపాయలు ఎడ్వాన్సు పారేశాడు. తర్జుమా చేస్తానంటే వో వంద పేజీలు యిస్తా. చాలా అర్జంటుగా మాత్రం చెయ్యాలి. పేజీకి అర్ధరూపాయట. కుళ్లు వెధవ! అంతకంటే ఎక్కువ యివ్వలేనన్నాడు. ఎడ్వాన్సు యిస్తున్నాడుకదా అని "సరే" అన్నాను. చేస్తావా ? (జేబులోంచి కొన్ని ఇంగ్లీషు కాగితాలు తీస్తాడు) యిదుగో...వద్దా ? (రాజు ఆసక్తి చూపకపోవడం గమనించి) చూడు రాజూ ! ఎన్నాళ్ళిట్లా సాగుతుంది? ఉన్న ట్యూషన్లు మానేసి, 'ట్రాన్సలేషన్సు' వదులుకుని, మీ అమ్మ పంపించే కొద్దిడబ్బుతో ఎట్లా దొర్లిస్తావోయి రోజులు! చదువుకూడా మానేసేటట్లున్నావు చూస్తే. చదవక ఏంచేద్దామని చెబుదూ ?

రాజు:- ఏం చెయ్యాలో · నా కొదిలెయ్యకూడదూ ? అది కూడా నీకేనా ?

రవణ:- ఓ. అయితే యిక నేను చెప్పేదేముంది ? (ఆగి మళ్ళీ పూర్వపు వుత్సాహంతో టేబుల్ మీద వెతుకుతూ) ఈ మధ్య కొత్త కథలుగాని, వ్యాసాలుగాని వ్రాశా వేమిటి ? నేను ఏరోజు కారోజే మంచి కొత్త కథ వ్రాద్దామనుకోవడం, లేచి కూర్చొని వ్రాయలేక పోవడం. మర్నాడల్లా మళ్ళీ ఆలోచన్లకోసం వెతుక్కో-

వడం. ఈ కథల విషయంలో 'ఐడియా' వాగానే వ్రాసెయ్యాలోయ్. 'డిలే' చేశామా పోయింవన్న మాటే. ఓ... యిదేమిటి? ఏదో వ్యాసంలావుందే? రెండేళ్ళ క్రితం "నేరం" మీద వ్రాసిన వ్యాసంలా వుంది. 'ఓల్డుస్టఫ్' దీన్నెవడు అచ్చేస్తాడు బ్రదర్ ? 4 సార్లు చదివినా నీ వుద్దేశమేమిటో నాకే బోధ పడకపోతే, ఆ సంపాదకుడికి ఏమర్థమవుతుందోయ్ ? (రాజు, రవణ ముఖంవైపే చూస్తాడు. రవణ యిది గమనించి) అవునోయ్ ...యిక్కడచూడు! (పేజీ త్రిప్పి) ప్రకృతిలో రెండు రకాల మానవులున్నారు. మొదటిరకం సామాన్యులు, రెండవరకం వుత్తములు. మొదటిరకంవాళ్లు వున్నదాంతోనే తృప్తిపడి న్యాయ రీత్యా నడుచుకుంటారు. రెండవరకం వ్యక్తులు వున్న దాంతో తృప్తిచెందక తమకు కావలసిన చట్టాల్ని తామే సృష్టించుకుంటారు. వారెవ్వరికి సమాధానం చెప్పాల్సిన అవసరం వుండదు. ఏమిటీ నాన్సెన్సు ! మనిషైనాక బాధ్యత ఎక్కడికి పోతుంది. వాడు సంఘానికో, దైవానికో ఎవరికో వకరికి సమాధానం చెప్పుకోవాల్సిన అవుసరం వుంది.

రాజు:- (అడ్డొచ్చి కోపంతో) లేదు. ఎవ్వరికీ సమాధానం చెప్పాల్సిన పనిలేదు. నీకు నువ్వే సమాధానం చెప్పుకోవాలి. పురుగులాపుట్టి, వ్యక్తిత్వం లేకుండా; పురుగులా చస్తానంటే అది వేరుసంగతి. అసలు ప్రశ్నల్లా; నువ్వు మనిషివా, పురుగువా ?

[యీసమయంలో లోపల్నుంచి ఆచారి విషాదంగా "చూడు చూడు నీడలు" అనే పాట వైలన్‌మీద వాయించ నారంభిస్తాడు. రాజు కూడా వక్కక్షణం ఆగి యిది విని యిదివరకటి కంటే వుద్వేగంతో]

రాజు:- యీ హాల్లోంచి రోజూ నాలాగే నువ్వూ నడుస్తూంటే దైవాన్ని గురించి మాట్లాడివుండవు. ఆ హాల్లో, ఆ గోడల అవతల ఏముందో తెలుసా? యీ ప్రపంచములోని బాధలు, విచారాలు అన్నీ కూడా అక్కడ గూడు కట్టుకున్నాయి. ఆ మనుష్యుల పేర్లేమిటో నాకు తెలియవు. కాని వాళ్ళకి తిండిలేదు, ఆరోగ్యంలేదు. వున్నవల్లా ఆకలి, దరిద్రం, రోగాలు, బాధలు. (ఆగి) యీ గోడ యివతల్నుంచి నేను వినే ఆ ఏడ్పులు, మూల్గులు, నీ దైవంకూడా విని మాట్లాడకుండా వున్నాడంటే, అటువంటి దైవం నా కక్కర్లేదు, అక్కర్లేదు.

[రవణ మాట్లాడలేకపోతాడు. రాజు ఆవేశం తగ్గించుకోడానికి కిటికీవైపు తిరుగుతాడు. రవణ విస్తుపోయి చూస్తుండగా, చటాలున రాజు యిటు తిరిగి, లోస్వరంలో]

రాజు:- నేనూ పురుగులా జీవించాల్సిందేనా? ఇంతకంటే ఔన్నత్యం సాధించలేనా? (గాఢ్దిగా వణుకుతాడు)

రవణ:- చూడు రాజూ! నీ బాధేమిటో నాకర్థమయ్యింది. నాదగ్గర డబ్బు వుంది. రా. బయటికి రా. భోంచేసి వద్దాం.

రాజు:- (ఆలోచనతో) ఇందాక ఏంజరిగిందో తెల్సా? ఆ హాల్లో యిద్దరు మాట్లాడుకోవడం విన్నా...సరిగ్గా

నా మనస్సులో వున్న విషయాలే వాళ్ళు మాట్లాడుకున్నారు.

రవణ:- ఏమిటది ?

రాజు:- (రవణ ముఖంలోకి చూస్తూ) నేనోటి అడగనా ?

రవణ:-అదీ...అట్లా అడుగు...వూరుకే సిగ్గుపడక. (జేబులోంచి 5 రూ॥లు కాగితం తీసి) ఇది చాలా ? (ఇవ్వబోతాడు.)

రాజు:- (నోటును వెనక్కి తోసేసి) 'విధి'అని ఏదో అంటారు చూడు! "దాన్ని తప్పించుకుపోవడం - అసాధ్యం" అంటారు నిజమేనా ?

రవణ:- (నవ్వేసి) చంపేసావు. ఇంతేనా ! నే నిటువంటి విషయాలు ఎప్పుడూ ఆలోచించను బ్రదర్. ఆలోచిస్తే ఏముంది, వున్న బుర్ర కాస్తా పాడవడం తప్పితే! ఈ ఆలోచన్లకేంగాని, ముందు బయటికిరా. కాస్త భోంచేద్దువుగాని.

రాజు:- (నుదుటిని చేత్తో నొక్కుకుంటూ, గొణుక్కుంటూ) నేనేం చేస్తున్నా? నా టైం అంతా ఇట్లా ఎందుకు 'వేస్టు' చేసుకుంటున్నా ? ఒదులు...నన్నొదులు. నన్నెందుకు యిట్లా బాధ పెడ్తావ్? నీకేం పనిలేదా యింక?

రవణ:- ఛీ ! మరీ ఫూల్ అయిపోతున్నావు. (చికాకుతో లేచి) నీ ఏడుపు నువ్వేడు. (వ్యాసాన్ని బల్లమీద సడేస్తూ అక్కడవున్న కవరుతీసి చూసి) ఇదేమిటి ? మీ అమ్మగారి దస్తూరిలా వుందే ? (పోస్టుముద్ర

చూసి) నాలుగు రోజుల్నుంచి యిదిట్లాగే సతమతమవుతున్న మాట? ఛీ! కాస్తయినా సిగ్గుండాలి.

రాజు:- (కవరును లాక్కొని) దీన్లో ఏముంటుందో తెల్సా? వాళ్ళు నాకోసం చేసిన త్యాగాలూ, చెయ్యబోయే త్యాగాలు! అంతే. అవన్నీ చదివి, తెలుసుకొని ఏడవడంతప్ప నేనేం చెయ్యగలను? (ఆలోచిస్తూ) అప్పట్లో సంగతి విన్నానా? నా చెల్లెలు విమలని ఆ ముసలివెధవ సాంబయ్యకిచ్చి పెళ్ళిచెయ్యాలని అమ్మ ఆలోచిస్తోంది. క్రిందటి వుత్తరంలో అంతా వాడి గుణగణాలు వర్ణనే. వాడు తల్చుకుంటే నాకు గొప్ప వుద్యోగం కూడా యిప్పించగలడుట.

రవణ:- ఏమిటీ-మీ చెల్లెలు విమలనా! ముసలాడికిచ్చా! మరి నువ్వేమన్నావ్?

రాజు:- నేను అనేదేముంది! ఆ పెళ్ళి నేను బ్రతికుండగా మాత్రం జరగదు.

రవణ:- రాజూ! దీనికల్లా నువ్వు డబ్బు సంపాదించటమే గొప్ప సమాధానం...నా మాటవిని యివి తీసికో.

[ జేబులోంచి మళ్ళీ యింగ్లీషు కాగితాలు తియ్యబోతాడు ]

రాజు:- (రవణ చేతిని అవతలకు తోసేస్తూ) చేతులు అరిగేట్లు తర్జుమాచేస్తే, పేజీకి అర్ధరూపాయి, రోజుకు రెండు గంటలు గొంతు చించుకుంటే నెలకు పదిరూపాయలు. ఇదేనా సంపాదన? నేనిట్లా ఎంతకాలం సంపాదిస్తే అమ్మకీ, చెల్లెలికీ తిండిపెట్టే శక్తి వస్తుంది? ఇంతకంటే రక్తాన్ని పిండి అమ్ముకోడం నయంకదూ? (ఆగి)

ఎవ్వరి సాయం లేకుండానే నా అంతట నేనే నావాళ్ళను పోషిస్తా.

రవణ:- సరే! అట్లాగే చెయ్యొచ్చుగాని ముందా వుత్తరం చించు. అందులో డబ్బేమైనా వుండొచ్చు.

[దూరంగా గడియారం 7 గంటలు కొడ్తుంది]

రాజు:- (ఉలిక్కిపడి) ఏడయ్యిందా? నన్నొదిలి దయచెయ్యిక. ప్లీజ్-ప్లీజ్! గెట్ అవుట్.

రవణ:- (కోపంతో) మరీ వెర్రి వెధవ్వాయి పోతున్నావు. (వెళ్తూ) మళ్ళీ కల్సుకుంటాను.

[రవణ హాల్లోకి వెళ్ళిపోతాడు. సత్రం గుమాస్తా అప్పుడే హాలు వెనకనుంచి వచ్చి రవణని చూసి]

స.గు:- ఎవరికోసం బాబూ?

రవణ:- (కోపంతో ఎగాదిగా చూసి) రాజుకోసం!

స.గు:- ఓ! రాజుగారి కోసమా! ఆయన స్నేహితులా బాబూ?

రవణ:- అవును. ఏం?

స.గు:- ఆయనకి స్నేహితులు గనుక చెబ్తున్నా. ఆయన్ని రెండురోజుల్లో గది ఖాళీ చేసేయమని చెప్పండి. లేక పోతే పోలీసులే వచ్చి ఖాళీ చేయిస్తారు.

రవణ:- అదా సంగతి. కొంచెం తమాయించండి. అట్లా తొందరపడితే ఎట్లా?

స.గు:- తొందరా! అద్దె అడుగుతానని మనిషే తప్పించుకు తిరుగుతుంటే! ప్రొద్దున్నే పోలీసు రిపోర్టిచ్చి వచ్చాను. జాగ్రత్తని చెప్పండి. నా సంగతి తెలిసినట్లు లేదింకా బాబుకి.

రవణః- కోప్పడకండి...నేను చెబుతా వాడికి.

స.గు:- ముందు అద్దె యిచ్చేసెయ్యమని చెప్పండి.

[సత్రం గుమాస్తా పైకెళ్ళిపోతాడు. చిట్టి హాలు వెనుకనుంచి కల్పన వాటాలోకి వచ్చేస్తుంది రవణ వెనక్కి వచ్చి రాజు గదివద్ద ఆగుతాడు. లోపల్నుంచి ఆచారి వైలన్ విషాదంగా విన్పిస్తూంటుంది. నారాయణరావు వచ్చి హాల్లో నిలబడతాడు. రవణ రాజుని పలకరించ డానికి ధైర్యం చాలక మళ్ళి వెనక్కి వస్తూండగా నారాయణరావు ముందుకొచ్చి]

నారా:- ఎవరు బాబూ ? రాజుబాబుగారి స్నేహితులా ! ఈలోకంలో నా అంత దరిద్రుణ్ణి ఎక్కడైనా చూశారా? ఓమూల మా ఆవిడ క్షయరోగంతో తీసుకుంటూంటే, నేను రెండు రోజుల్నుంచి...

రవణ:- (ఎగాదిగా చూసి) ఊఁ ! చాల్లే.

(త్వరితంగా జేబులోంచి ఓ రూపాయితీసి నారాయణరావు చేతిలో పెట్టి చరచరా బయటకి వెళ్ళిపోతాడు. నారాయణరావు విస్తుపోయి రూపాయి నోటును అట్లాగే పట్టుకు చూస్తుంటాడు. అంతవరకు గదిలో 'అనీజీ'గా బాధపడుతూ తిరుగుతున్న రాజు, అఖరికి నిట్టూర్చి హాల్లోకి వస్తాడు. రాజుని చూసి నారాయణరావు ముందుకొచ్చి)

నారా:- ఎవరు బాబూ ! రాజుగారేనా ! తొందర పనేమీ లేకపోతే మీతో కొంచెం మాట్లాడాలి బాబూ.

(రాజు ఆగిపోతాడు. నారాయణని ఒకసారి తీక్షణంగా చూస్తాడు. ఇంతలో పోలయ్య బుడ్డిదీపంతో హాలు వెనుకనుంచి వచ్చి మెట్ల పైకి వెళ్ళిపోతాడు.)

రాజు:- నాతోనా ?

(నారాయణరావు 'అవును మీతోనే బాబూ !' అన్నట్లు తల వూపు తాడు. రాజు తల వూపి తన గదిలోకి వెళ్తాడు. నారాయణరావు అనుసరిస్తాడు.)

నారా:- ఈ గుబులంతా ఎవరితోనో వకరితో వెళ్ళబోసుకోక పోతే పిచ్చికూడా ఎక్కిపోతుంది బాబూ! రాజు యితే ఫర్వాలేదుగాని, ఎంతచెడ్డా మనస్సుకదా! నన్ను మీా రెరుగుదురనుకుంటాను... తాలూకాఫీసులో లోన్సుగుమాస్తాని - నారాయణరావుని.

రాజు:- ఊఁ!

నారా:- ఈ రోజుల్లో కాస్తో, కూస్తో తినని వాడెవడు చెప్పండి. అసలు మేతవెయ్యందే ఏపనన్నా జరుగుతుందా అంట! అయితేనేం నేనేవాళ్ళ కళ్ళ బడ్డాను. లంచాలు తిన్నానని డిస్మిస్ చేసేశారు. నేను గొప్పవాణ్ణనీ, అమాయకుణ్ణనీ చెప్పడంలేదు. నేనూ అందరిలాంటివాణ్ణేగదా! నాకూ భార్యా పిల్లలున్నారుకదా; వాళ్ళ బ్రతుకేంకావాలి! నేనొట్టి త్రాష్టుణ్ణి. ఓ ప్రక్క భార్యా పిల్లలూ మాడిపోతుంటే, మరో ప్రక్క వున్నవన్నీ అమ్మేసి తాగేసేంత నీచుణ్ణి. అటువంటి నీచుణ్ణి వుద్యోగంలోంచి తొలగిస్తే, అంతకంటే నీచం పనులు చేస్తాడంటూరా, చెయ్యడంటూరా? ఈ త్రాగుడుంది చూశారూ, మహాచెడ్డది. వీటన్నింటికంటే మరీ చెడ్డది దరిద్రం! కూతురి మానాన్ని కూడా బలితీసుకుంటుంది! ...మిమ్మల్ని విసిగిస్తున్నట్లున్నా!

రాజు:- [లేదని తలూపుతాడు.]

నారా:- మా ఆవిడ వుంది. ఎప్పుడూ ఆ లోపల మంచంమీాద పడివుంటుంది. అది చావా చావదు, బ్రతాకా

బ్రతకదు. దానికి క్షయరోగం; నాకు త్రాగుడు రోగం. ఒద్దే మానెయ్యండన్నా! కాని మా ఆవిడ నా మాట వినలేదు. మా ఆవిడ నా మాట వింటే మండిపడ్తుంది. మరి నేను యింటికి అప్రయోజకుణ్ణి గనక నన్నెవరూ లెక్కచెయ్యరు. "వెళ్ళి సంపాదించుకురా,- ఎద్దులావున్నావ్?" అంది కల్పనతో మా ఆవిడ. కల్పనని ఎరగరూ! నా మొదటి భార్యా కూతురు. బంగారంలాంటిపిల్ల! ఆ రోజల్లా అది ఒకటే ఏడుపు. నా భార్యదాన్ని రాసి రంపానబెట్టింది. ప్రాణాలు తోడేసింది. ఆఖరికి ... ఆఖరికి సిగ్గును చంపుకుని, మాకోసం తన బ్రతుకుని బుగ్గి చేసుకుంది కల్పన.

[నారాయణరావు కళ్ళు తుడుచుకుంటాడు ఆగి. రాజు మౌనంగా అతన్ని చూసి బాధపడ్తూంటాడు. మళ్ళీ రుద్ధమైన కంఠంతో]

ఈ పాపానికంతా కారణం ఎవరనుకున్నారు? నేను... నేను ఏ పనీ చెయ్యలేను త్రాగడం మినహా. దగ్గడం తప్ప మరేమీ చెయ్యలేదు మా ఆవిడ. "ఊరికే కూర్చుని తింటే ఎట్లానే" అని కల్పనని 24 గంటలూ కోసేసేది అది. కల్పన బంగారంలాంటి పిల్ల. కానేం చేస్తుంది? ఆకలిబాధ భరించగలదా? నా దొంగతనాలు భరించగలదా? తల్లి రోగం సహించగలదా? ఏం చేస్తుందది బజారున పడక? ఏంచేస్తుందది సిగ్గును చంపుకోక?

(హాల్లోంచి మాటలువిని నారాయణరావు ఆగిపోతాడు. హాల్లో కల్పన నులకమంచంపైన జంబుఖానా పరుచుకుంటూ వుంటుంది.

నెమ్మదిగా వర్కర్ సూరన్న వచ్చి సరసమాడబోతాడు. కల్పన యిప్పుడు కాదని ఖండలిస్తుంది. కాని వర్కర్ సంజ్ఞలుచేస్తూ లోప లకు రమ్మని బ్రతిమాలుతాడు. ఇంతలో పైనుంచి క్రిందకు దిగు తున్న సత్రం గుమస్తా యిది చూస్తాడు. వర్కర్ నెమ్మదిగా జారు కుంటాడు.)

స.గు:- (కల్పనతో బిగ్గరగా) ఇక్కడ ఇట్లాంటి వ్యవహారాలు పనికిరావని నీ కెన్ని సార్లు చెప్పాలి ? ఇది పెద్దమనుష్యు లుండే చోటని జ్ఞానంలేకపోతే ఎలా ! నువ్విక్కడ ఒక్కక్షణం వుంటే వూరుకునేది లేదు. ఊఁ! వెంటనే మీరంతా యిక్కడనుంచి ఖాళీచేసెయ్యండి ! హాఁ ! ఊరుకుంటూంటే మరీ రెచ్చిపోతున్నారే వీళ్ళంతా ?

(లోపల్నుండి వైలన్ వాయిద్యం.)

కల్పన:- (లేచి తడబడుతూ) నా తప్పేమీ లేదండి.

స.గు:- నా కదంతా తెలియదు. వెంటనే మీరంతా ఖాళీ చేసి మరోచోటు చూసుకుంటారా ? లేకపోతే సామాన్లన్నీ బయట పారవేయించమన్నానా ?

కల్పన:- మా అమ్మకు జబ్బుగావుంది...ఆ పని మాత్రం చేయకండి. కావలిస్తే నేను వెళ్ళిపోతాను.

స.గు:- ఊఁ ! వెంటనే కానియ్యి! నీ కూడుకోసం నాకూట్లో దుమ్ముకొడతావా? అద్దెలుకూడా యివ్వలేని వాళ్ళకి గదులెందుకు – వెళ్ళి ఏ చెట్టుక్రిందో పడుండక.

కల్పన:- నాలుగయిదు రోజుల్లో మీ బాకీ అంతా తీర్చేస్తా. కనికరించండి. నే నిప్పుడే వెళ్ళిపోతా. కాని మావా ళ్ళని మాత్రం అవస్థ పెట్టకండి.

స.గు:- సరే, నువ్వెంటనే దయచేయి ! ఇంకోక్షణం కూడా యిక్కడ వుండటానికి వీల్లేదు. ఆఁ ! తెల్సిందా !

కల్పన:- తెల్సిందండి. ఇప్పుడే వెళ్ళిపోతా.

స.గు:- ఊఁ!

[కల్పన కన్నీళ్ళతో లోపలికెళ్ళి సంచి తీసుకొని బయటికి వెళ్తూ తండ్రిని గమనించి]

కల్పన:- అమ్మా, పిల్లలూ జాగ్రత్త నాన్నా! నేను రోజూ ఏదో వకవేళ వచ్చి చూసి పోతూంటా.

[కల్పన దిగులుగా వెళ్ళలేక, వెళ్ళలేక వెళ్ళిపోతుంది. తండ్రి పిలవబోతాడు కాని నోట మాటరాదు. ముందుకు కదిలబోగా రాజు వారిస్తాడు. ఇంతలో చిట్టి కల్పన వాటాలోంచి బయటకువచ్చి 'అక్కా, అక్కా'' అని పిల్చి అటు ఇటు చూసి ''అక్కేది?'' అంటూ ఏడవ సాగుతుంది. రాజు, నారాయణరావు హాల్లోకి వస్తారు సత్యం గుమాస్తా తువ్వాల విదిలించి బయిటకి వెళ్తాడు. నారాయణరావు హాల్లో నెత్తిని చెయ్యేసుకుని కూలబడతాడు. మేడ మెట్లపైనుంచి అంతకముందే చేతిలో కత్తితో వచ్చిన పోలయ్య చిట్టి ఏడవడం చూసి]

పోల:- అదేంటమ్మా! ఎందుకు ఏడుపు. అక్కయ్య ఎక్కడి కెడుతుంది? ఇప్పుడే వచ్చేస్తుంది. అబ్బే-ఛ-అట్లా ఏడవకూడదు. నీకు మాంచి గుర్రం చూపించనా. భలే గుర్రంలే, చూస్తావా...(చిట్టి తల వూపగా) రా మరి, (ఎత్తుకోబోయి కత్తి చేతిలో వుండటం చూసి, రాజుతో) బాబుగారూ! ఈ కత్తి కాస్త వంటింట్లో— (రాజు అందుకుంటాడు.) రాఅమ్మా! మనం గుర్రంచూద్దాం. ఆఁ, భలే గుర్రంలే.

(ఎత్తుకుని పోలు వెనక్కి వెళ్తాడు. రాజు ఆ కత్తినే చూస్తూ ఆలో చన్లో పడ్తాడు. అక్కడున్న పుస్తకంవైపే చూస్తున్న నారాయణరావు రాజు ఆలోచనలో వుండటం చూసి నెమ్మది నెమ్మదిగా పుస్తకం దగ్గరకు చేర్తాడు. రాజు యిదే అదను అనుకొని త్వర త్వరగా తన గదిలోకి వెళ్తాడు. బయటికి తొంగి చూసేసరికి నారాయణరావు 5 రూ॥లు నోటు పుస్తకంలోంచి కాజేస్తాడు. ఇంతలో పోలయ్య లోప ల్నుంచి వచ్చి నారాయణరావుని గమనించి)

పోల:- హారి ! మళ్ళీ డబ్బులు ఎత్తుకుపోతున్నావా ? మీా ఆవిడతో సెప్పేయ్యనా ?

నారా:- పోలయ్యా ! నీకు పుణ్యముంటుంది. అయినా చిల్లర డబ్బులే లేవయ్యా...

పోల:- చిల్లరేనా? సరేగాని, చిట్టి పడుకుంది. నేను చినిమాకు పోతుండా, కాస్త గుమ్మం చూస్తోండు. సరేనా ?

[నారాయణరావు తల వూపగా, పోలయ్య బయటికి వెళ్ళిపోతాడు. ఒక్కక్షణం ఆగి అటు యిటు చూసి నారాయణరావు బైటికివెళ్ళి పోతాడు. రాజు యిది చూసి, వెనక్కివచ్చి లాంగ్ కోట్ తొడుక్కుంటాడు కాస్సేపు మానసిక ఘర్షణ. అటు యిటు తిరుగుతాడు. పోలయ్య బయటికి వెళ్ళిన దగ్గర్నుంచి ప్రారంభమైన వైయిలన్ వాయిద్యం క్రమంగా క్లైమాక్సుకి వస్తూవుంటుంది. దాంతోబాటు రాజు మనస్సులో ఘర్షణ కూడా ఎక్కువవుతూ వుంటుంది. అటు యిటు తిరుగుతాడు. ఒసారి కోటువైపు చూసుకుంటాడు. బయట అలికిడి వింటాడు. మళ్ళీ తిరుగుతాడు. నిలబడతాడు. జుట్టుని వ్రేళ్ళతో లాక్కుంటాడు. గొణుక్కుంటాడు]

రాజు:- "ఈ అవకాశం మళ్ళీ వస్తుందా ?" (కాస్సేపాగి) "నేను మనిషినేనా ?"

[ఆలోచన్ను భరించలేక తల నొక్కుకుని, ఓ నిర్ణయానికొచ్చి కత్తిని తీసుకొని ఓసారి దానివంక నిశితంగాచూసి, ఒళ్లు గగుర్పొడవగా దాన్ని త్వరితంగా కోటుజేబులో పెట్టుకొని, మెడకు మఫ్లర్ చుట్టుకొని గది గుమ్మందగ్గరకు వస్తాడు. త్వరితంగా హాలు మధ్యకి వచ్చి ఆగుతాడు. అటు-ఇటు చూస్తాడు. జేబు చూసుకుంటాడు. ఒకక్షణం 'వీకెన్' అవుతాడు. ఏదో అతీతమైన శక్తి తనని లాక్కుపోతున్నట్లు బయటికి వెళ్ళిపోతాడు. వైలన్ మాంచి స్థాయిలో విన్పిస్తూంటూంది. సత్రం హాలంతా నిర్మానుష్యం.]

( తెర )

# రెండవ రంగము

(మూడు రోజుల తర్వాత, అదేస్థలములో)

[హాలంతా మసకవెల్తురులో వుంటుంది. రాజు తన గదిలో ఒక బూట్‌ని గుండెలకు అదుముకొని, వాలుకుర్చీలో పడుకుని వుంటాడు. నిద్రలో గొణుగుతూ వో ప్రక్కకు తిరుగుతాడు. మరి కాసేపటికి వులిక్కిపడి కూర్చొని "అవును తుడిచేస్తే యెట్లా కన్పిస్తుంది? ఎరుపు మీద ఎరుపు కల్సిపోతుంది." అని గొణిగి మళ్ళా వెనక్కి వేర్లబడు బూట్‌ను గుండెలకు అదుముకుంటాడు. ఒకటి రెండుసార్లు జ్వరం తగిలినట్లు మూలుగుతాడు. అటునుంచి యిటు తిరిగి పడుకుంటాడు. వెంటనే వులిక్కిపడి లేచి కూర్చుని, చుట్టూ చూస్తాడు. తన చేతిలోని బూట్‌ని చూసుకుంటాడు. ఏదో గుర్తుకొచ్చి ఖంగారుగా ఒల్లమీద చేతిరుమాలు తీసుకుని బూట్‌ని. కాలిసున్న బూట్‌ని శుభ్రంగా తుడిచి మళ్ళీ వాటిని పరిశీలించి తొడుక్కుంటాడు. ఇంకా ఏదో మరిచిపోయి నట్లు ఆలోచించి జేబులో తడుముకుంటాడు. కావలసినది కనబడక స్తంభించిపోయినట్లయి మళ్ళీ ఏదో గుర్తుకొచ్చి తలగడ కవర్లో వెతుకు తాడు. దాన్లోంచి ఓ పర్సు—రెండు పొట్లాలు తీసి చేతిలో పట్టుకొని చేతిని నడుంవెనక పెట్టుకుని గది బయటకొచ్చి ఓసారి చూసి, ఆలో చించి మళ్ళీ వెనక్కివచ్చి, వాటిని తలగడ కవరులో దాచి, తలగడను యధాస్థానంలో వుంచుతాడు. కుర్చీవద్దకు వచ్చి నిలబడి తలగడవైపు నిశితంగా చూసి తృప్తిపడతాడు. 50 మైళ్ళు నడిచివచ్చిన వాడిలా అలసి పోయి కుర్చీలో జేర్లబడి నిట్టూరుస్తాడు. చటాలున యేదో గుర్తుకొచ్చి కుర్చీలోంచి కేలండర్‌వైపు చూస్తాడు. నేలపై పడివున్న పేపరును తీసి తారీఖుకోసం చూస్తాడు. యింతలో పోలయ్య లోపలికొస్తాడు.]

పోల:— అమ్మయ్యా! లేచారా! వంట్లో యిప్పుడెలా వుంది? మూడు రోజుల్నుంచి వకటే జ్వరం! మాయజ్వరం మూసినకన్ను తెరవనిస్తేనా!

రాజు:- ఏమిటి! మూడురోజుల్నుంచి జ్వరంతో పడున్నానా! యివ్వేళ, ఏంవారం పోలయ్యా ?

పోల:- ఆదివారం బాబయ్యా ! (ఆగి) అసలు పోలీసోళ్ళ గాలే మంచిదికాదు బాబయ్యా. ఆరోజున ఆ పోలీసు స్టేషన్ కి వెళ్ళడంతో వచ్చిపడింది మాయజ్వరం.

రాజు:- పోలీసుస్టేషన్ కి వెళ్ళానా నేను! నాకేంగుర్తు లేదే ? అఁహా — సత్రం అద్దెను గురించికాదూ! ఇప్పుడు కొంచెం కొంచెం గుర్తుకొస్తోంది... (ఆకస్మికంగా) ఇప్పుడే వస్తా పోలయ్యా.

పోలయ్య:- అసలే నీరసంగావున్నారు. యిప్పుడు బయటికి ఎందుకు బాబయ్యా! ఏమన్నా కావలిస్తే నాతో చెప్పండి, తెచ్చిపెడతా.

రాజు:- లేదు. యిప్పుడే వచ్చేస్తా.

(పోలయ్య ఏం చేయలేక హాలువెనక్కి వెళ్తాడు. రాజు తూలుకుంటూ బయటికి వెళుతూండగా బయటినుంచి లోపలికొస్తున్న కల్పన తార సిల్లుతుంది. ఇద్దరూ ఒకరి నొకరు చూసు కుంటారు. కల్పన తల వంచుకొని ముందుకు అడుగు వెయ్యబోగా)

రాజు:- (ఆగి) కల్పన అంటే నువ్వేకదూ ?

కల్పన:- (వినపడీ వినపడనట్లుగా) అవును ఏం ?

రాజు:- (తడబడుతూ) అబ్బే ! ఏంలేదు.

(ఏదో మాట్లాడబోయి మనసు మార్చుకొని త్వరితంగా రాజు బయటికి వెళ్ళిపోతాడు. కల్పన అతను వెళ్ళిన దిక్కే ఒక్కక్షణం చూసి; వెనక్కి తిరిగేసరికి పైనుంచి మెట్లు దిగుతూ సత్రం గుమాస్తా)

స.గు:- ఆఁ ! మళ్ళీ వచ్చావా ?

కల్పన:- (భయపడుతూ) ఇప్పుడే వెళ్ళిపోతానండి. మా అమ్మకి డబ్బిద్దామని వచ్చేను.

స.గు:- ఆ చేత్తోనే మా అగ్రెసూడా యిచ్చెయ్యగూడదూ, ఆ కాన్సలేసుబాబు నా పీక నత్తేస్తుంటాడు.

కల్పన:- అది యిద్దామనే తెచ్చాను.

స.గు:- ఆఁ! తెచ్చేవ్వా - మాత్రంపే అట్లాగుంచాలి.

కల్పన:- ఇదుంచండి. ఇంకా అయిదురూపాయలు యివ్వాల్సి వుంటాం. అదికూడా మరో రెండు మూడు రోజుల్లో...

స.గు:- (చేతిలోంచి డబ్బు తీసుకొని) నీ సంగతి నాకు బాగా తెలుసు తల్లీ, కాని లోకులు కాకులు గదమ్మా. నన్ను పొడిచి చంపేస్తారు-నిన్నిక్కడ వుండనిస్తే. ఏమీ అనుకోక, యిక్కడకు రాదల్చుకుంటే కొంచెం చీకటి పడ్డాక వస్తూండు. మరి నేను వెళ్తాను. ఆ అయిదు సంగతి మర్చిపోకేం!

(ముక్కుపొడి పీలుస్తూ బయటికి వెళ్ళిపోతాడు సత్రం గుమాస్తా. కల్పన హాలు వెనక్కి వెళ్ళిపోతుంది. బయటనుంచి రవణ, బ్రీఫ్కేస్తో వున్న సర్కిల్ జగన్నాథం లోపలికొస్తారు. రాజు గదిముందు ఆగుతారు)

రవణ:- వీడు లోపలున్నట్లు లేడే?

జగ :- జ్వరంతో ఎక్కడికెళతాడోయ్ - సరిగ్గా చూడు.

(ఇంతలో పోలయ్య హాలు వెనుకనుంచి వచ్చి, రవణని చూసి నమస్కరించి)

పోల:- దణ్ణాలు బాబూ! అయ్యగారు యిప్పుడే బయటికెళ్లారు.

రవణ:- వాణ్ణి ఇంత జ్వరంతో ఎక్కడికి పోనిచ్చావు పోలయ్యా!

పోల:- నామాట వింటేకదా బాబయ్యా! వద్దంటున్నా యిప్పుడే వస్తానని బయటికెళ్లారు. లోపల కూర్చోండి, వచ్చేస్తారు.

రవణ:- నీకు కాస్తయినా బుద్ధిలేదు పోలయ్యా!

జగ:- ఎక్కడో యిక్కడే వుండివుంటాడోయ్. ఎక్కడికెళ్తాడు? (జగన్నాథం లోపలికెళ్లి గది నలుమూలలా చూస్తాడు)

రవణ:- (హాల్లోంచి) రాజూ! రాజూ!

(సమాధానం రాకపోగా, రవణ విస్తుపోయి హాల్లోనే నిలబడి, అటూఇటూ చూస్తాడు. పోలయ్య భుజాలెగరేసి మెట్లపైకి వెళ్లిపోతాడు. జగన్నాథం గదిలోంచి బయటికొస్తాడు. "ఏమిటి గమ్మత్తు" అన్నట్లు రవణవైపు చూస్తాడు. ఇంతలో రాజు న్యూస్ పేపర్లతో బయటినుంచి, ఆయాసపడ్తూ లోపలికి వస్తాడు. రవణ రాజునిచూసి ఎదురెళ్లి)

రవణ:- ఏమిటోయ్! నీకేమైనా మతుందా-లేదా? పొద్దుటే జ్వరంతో వీధిలోకి వెళ్తావా? చూడు! ఆ మొహమంతా ఎట్లా పాలిపోయిందో!

రాజు:- (వదిలించుకోడానికి నీరసంగా ప్రయత్నించి) నీకు నమస్కారిస్తా! ముందు నన్నొదులు.

(రవణ వదుల్తాడు. రాజు నీరసంగా లోపలికి వెళ్తాడు. వెనకాలే రవణ, జగన్నాథం రాజుగదిలోకి వెళ్తారు.)

జగ:- 'గుడ్ మార్నింగ్ మిస్టర్ రాజూ!' వంట్లో కులాసాగా వుందా?

రాజు:- (అనుమానంగా జగన్నాథాన్ని చురచుర చూస్తూ) 'ఓ! హెల్!' నన్ను కాస్త కూర్చోనియ్యరా ఏమిటి? (దగ్గరలోవున్న కుర్చీలో కూలబడతాడు రాజు.)

రవణ:-నిన్నింక కాళ్లూచేతులూ కట్టేసి ఓగదిలో పడెయ్యాలి; లేకపోతే ఎవరిమాటా వినేట్లు లేవు.

(6)

రాజు:- (నవ్వేసి) సరేగాని— మీరెవరు? పరిచయమే చేసేవు కాదు.

రవణ:- ఈయన్ని నువ్వు గుర్తేపట్టలేదా? చంపేవు. మొన్న నువ్వు పోలీసుస్టేషనుకి వెళ్లినప్పుడు వీరినిచూడలేదూ? బేఢ్రిస్సులో వుంటంవల్ల గుర్తుపట్టలేక పోయినట్లు న్నావ్. సర్కిల్ జగన్నాథం గారోయి, నా 'ఫ్రెండ్!'

రాజు:- (నిర్లిప్తంగా) ఓ! ఐ సీ.

రవణ:- ఆరోజున నీ ఎడ్రెస్ని యితనుకనక వెతికి యియ్యక పోతే యిప్పటివరకూ నీకోసం వెతుక్కుంటూనే వుండేవాణ్ణి!

రాజు:- (కరచాలనం చేస్తూ) 'గ్లాడ్ టు సీ యు ఎగైన్' ఇట్లా దయచేసేరేం?

జగ:- మీరు రారోజున పోలీసు స్టేషన్లో స్పృహతప్పి పడి పోయి నప్పట్నుంచీ ఎట్లావున్నారో చూద్దామని ప్రయత్నం. ఆఖరికివ్వేళ కుదిరింది.

రాజు:- థాంక్స్.

జగ:- మీరసలా రోజున జ్వరంతో వున్నారని తెలిస్తే మా వాళ్లచేత అన్ని ప్రశ్నలు వెయ్యనిచ్చే వాణ్ణేకాను. 'అయాం రీయలీ సారీ ఫర్ ఆల్ దట్.'

రవణ:-నీవెర్రిగాని వాడికిదంతా గుర్తుందంటావా? (రాజుతో, ఏమోయ్. నీకేమైనా గుర్తుందా?

రాజు:- (గుర్తు తెచ్చుకో ప్రయత్నించి) వుహూ.

రవణ:- (నవ్వి) నేను చెప్పలే? (రాజుతో) జగన్నాథం బలే సరదా మనిషిలే. మన ఏ. ఎస్. పి. గారికి యితను

ప్రాణం అంటే నమ్మి.

(రాజు వకటి—రెండు క్షణాలు జగన్నాధం ముఖంవైపు చూసి; తన ముఖం ప్రక్కకు తిప్పేసుకుని, రవణని వుద్దేశించి)

రాజు:- నాకీ జ్వరం ఎన్నాళ్లనుంచి?

రవణ:- ('నేను చెప్పలేదూ' అన్నట్లు జగన్నాధంవైపు చూసి) మూడు రోజుల్నుంచి!

రాజు:- నే నేమైనా కలవరించేనా?

రవణ:- (నవ్వి) కలవరింపా? నువ్వు మాట్లాడని 'నాన్సెన్సు' యింకా యీ భూప్రపంచంలో ఏమైనా మిగిలివుందా అని!

రాజు:- నువ్విక్కడికి రోజూ వస్తూన్నట్లు లీలగా అన్పిస్తోంది.

రవణ:- లీలగా అన్పిస్తోందా? ప్రాక్టికల్‌గా నిన్న, మొన్న నా మకాము యిక్కడ.

పోల:- (అప్పుడే గుమ్మంవద్దకు వచ్చి యీ మాటలు విన్న పోలయ్య) అదంతా అసలు రకతంలో వుంది బాబూ!

రాజు:- (హీనస్వరంతో) రక్తమా? ఎక్కడ?

పోల:- (రవణతో) రకతంబాబూ! రకతం పాడయిపోతే యిట్టాగే మాట్లాడతారట. మారాజు, రోజూ కడుపు నిండా బోంచేత్తే యింతవరకొచ్చేదా, బాబూ! ఎప్పుడు సూసినా ఆ పాడుకాపీలు, సిగరెట్లేగాని, అన్నం ముట్టకునే వోరనుకున్నారా బాబూ!

రవణ:- సరేగాని, నువ్వెళ్లి 3 కాఫీలు తీసుకురా - యిదిగో! (రూపాయికాగితం యిస్తాడు. పోలయ్య ఏదో చెప్ప బోయి, మానుకుని, నోటును తీసుకుని వెళ్లిపోతాడు. రాజుతో) చూడవోయ్! నీకోసం - ఫస్ట్‌క్లాసయిన

రెడీమేడ్ డ్రెస్సు తెచ్చేను.

(సెల్లోఫెన్ పేపరులోవున్న చొక్కా, పేంట్ చూపుతాడు-రవణ. రవణముఖం అమెరికాని జయించిన వాడి ముఖంలా, విజయగర్వంతో నిండి వుంటుంది.)

రాజు:- (సంతోషించకపోగా అనుమానంతో) డ్రెస్సా? నాకా? డబ్బెక్కడిది?

రవణ:- నాదికాదు లేవోయ్. నీడబ్బే!

రాజు:- (మరింత ఆశ్చర్యంతో) నాడబ్బా?

రవణ:- ఏమిటిట్లా చూస్తావ్? మీ అమ్మగారి కవరులో డబ్బుంటుంది, చింపమంటే నువ్వు చింపేవు? నేనే ఆఖరుకి చింపి చూసేను.

రాజు:- అమ్మ డబ్బు పంపిందా?

రవణ:- అవును. (జగన్నాథంతో) వీళ్ల అమ్మ అంటే ఏమనుకున్నావు? దేవత! తను తినక పోయి నా ముందు కొడుక్కి ఎట్లాగోలాగ పంపిస్తుంది.

రాజు:- ఏదీ! అమ్మరాసిన వుత్తరం ఏది?

రవణ:- (కొంచెం చికాకుతో) చూడు-ఎక్కడో ఆ బల్లపైనే వుంటుంది.

(రాజు వుత్తరం వెతికి పట్టుకుని-చదువుకుని ఆలోచనలో పడిపోతాడు. ముఖం విచారంగా వుంటుంది)

రవణ:- కవరుచించి చూసేసరికి వందరూపాయిల నోటు కన్పించింది. వెంటనే నాకో 'బ్రిల్లియంట్ ఐడియా స్ట్రయిక్' అయ్యింది. ఏం చేశాననుకున్నావ్ అప్పుడు? వెంటనే సత్రంగుమాస్తా నోరు మూయించాలని, వాడిని పిలిచి అద్దె బాకీ పాతిక రూపాయలువాడి

మొహాన్ని విసిరికొట్టేను. ఆతర్వాత రిక్షా యెక్కి, వెరైటీహాలుకి వెళ్ళి, బెస్టు షర్టు, బెస్టుప్యేంటూ 'మోస్టు అప్టూడేటు వెరైటీ'వి తెమ్మన్నా. 30 రూపాయిలు పోతేనేం 'లేటెస్ట్ సార్ట్ ఆఫ్ సుపీరియర్' క్లాత్ లో దొరికాయి. రేపొద్దున్నే నువ్వు శుభ్రంగా స్నానం చేసేసి యివ్వి తొడుక్కున్నావంటే '[గేస్ కెల్లీ' లాంటి వాళ్ళు నిన్నుచూసి 'బ్లిన్క్' అవ్వాల్సిందే. ఆఁ అన్నట్లు మిగతా బేలెన్సు యిదిగో. (నోట్లు బల్లపై పెడ్తాడు. జగన్నాథంతో) ఆఁ ఏమిటోయ్, జగన్నాథం మొన్న బై-ఎలక్షనులో అంత గొడవజరిగితే తుక్కు రేగకొట్టక చూస్తూ వూరుకున్నా రేమిటోయి. మీవాళ్ళు, మీరు కొంచెం కలుగచేసుకునివుంటే మావాళ్ళు ఢంకామీద దెబ్బకొట్టి మరీ – (రాజు ముఖంచూసి ఆగిపోయి, రాజుతో) ఏమిటి? ఏం జరిగింది? ఏమైనా చెడువార్తా ?

రాజు:– అమ్మ యీవుత్తరం రాసి ఎన్నాళ్ళయ్యిందో తెల్సా? పదిరోజులు? ఆవిడ యిక్కడకు వస్తోందిట. బహుశా యీపాటికి యీవూరొచ్చేసిందేమో కూడా!

రవణ:– వస్తే యిక్కడకే వస్తారుగా?

రాజు:– నేనిట్లా వుండగానా? పైగా, నేనిక్కడ లేనట్లు ఆ సాంబయ్య ఎక్కడో మంచి బంగాళాలో వసతి చూస్తానన్నాట్ట.ఆవిడని ఎక్కడో దించి వుంటాడారోగ్!

రవణ:– సాంబయ్యా! సాంబయ్య ఎవ్వడు ?

రాజు:– ఇంకెవ్వడు ? ముసలి పెళ్ళికొడుకు.

రవణః– అదేమిటోయ్, ఆయన్ని గురించి నువ్వు ముందే చెడ్డగా ఎందుకు అనుకోవాలి ?

రాజుః– మేం బీదవాళ్ళమనే లోకువకాకపోతే నేనిక్కడ వుండగా మా అమ్మని వేరే ఎక్కడో బంగాళాలో దించుతానంటాడా ?

రవణః– అవునోయ్! ఈ లిక్కంత గదిలో వుంటే ఆవిడకి ఆట్టేసౌకర్యంగా వుండదనీ, పైగా నీకు యిబ్బందిగా వుంటుందనీ ఆయన ఆలోచించి వుంటాడు. (పోలయ్య కాఫీ గ్లాసుల్తో ప్రవేశిస్తాడు.) వూరికే యక్సైట్ అవకు – ముందా కాఫీతాగు. వూఁ! (రాజువచ్చి కాఫీ తాగుతూంటాడు.)

పోలః– అయ్యగారూ! ఆ దొంగ చచ్చినోడికి సిచ్చ పడిందాండి ?

జగః– ఎవరికిరా ?

పోలః– ఆడికేనండి. ఎల్లేసే రంగయ్య గాడికి! ఈరభద్ర య్యనీ కాబూలోణ్ణి సంపేదు సూడండి– ఆడికి.

జగః– ఓ వాడికా! అరెస్టు చెయ్యగానే శిక్ష పడిపో తుందిట్రా; ఇంకా విచారణా అదీ లేదూ ?

(రాజు వింతగా జగన్నాధంవైపుచూస్తూంటాడు.)

రవణః– నిజంగా ఆ ఎల్లేసే రంగయ్య యీహత్యలు చేసేడంటే నేను నమ్మలేకుండావున్నానోయి.

రాజుః– ఏమిటి మీరుమాట్లాడేది ? దేన్ని గురించి ?

రవణః– ఆఁ ఆమధ్య నీకుజ్వరం తగిలిందిచూడు; అప్పుడు కాబూలీవాణ్ణి, వాడ్రిబ్రోకర్ వీరభద్రయ్యనీ, ఎవరో హత్యచేసేశారులే !

రాజు:- (గొణుగుడుగా) వీరభద్రయ్యనా ?

రవణ:- అవును వీరభద్రయ్యనే! పోలీసు స్టేషన్‌లో ఈ గొడవ విన్నట్లు నీకేమీ గుర్తురావడంలేదా ?

రాజు:- అక్కడికి వెళ్ళడంగుర్తుంది. తర్వాత ఏమీగుర్తుకు రావడంలేదు.

పోల:- చాలా గోరంగా సచ్చేరు బాబూ ఆళ్ళిద్దరూ ! అక్కడ రకతం సూత్తేనే నాకళ్లు తిరిగి పడిపోయేంత పనయిపోయినాది. ఇంతింత ఎడల్పున వున్నాయి ఆ కాబూలోడి గుండెలో కత్తిపోట్లు! ఆ ఈరభద్రయ్య మొహం సూడనే లేకపోయేనంటే నమ్మండి.

రాజు;- (బాధతో ముఖాన్ని ఓ ప్రక్కకుతిప్పుకొని) పోలయ్యా ! ఇక ఆపు.

రవణ:- (రాజుతో) ఆ జరిగింది చాలనన్నట్లు మనఇన్స్పెక్టర్ ఓ అమాయకుణ్ణి వురికంబానికి ఎక్కించబోతున్నాడు. (జగనాథంతో) అసలు జరిగిందేమిటో మన రాజుకి చెప్పు; వాడి వుద్దేశం కూడా విందాము.

జగ :- నువ్వు చెప్పకూడదూ ?

రవణ:- కాదు. హత్యలు జరిగే సమయానికి నువ్వా యించుమించు అక్కడే వున్నావు గనక, నువ్వు చెప్పడంలో వున్న మజా వేరు. (రాజు సరిగా కూర్చుని జగన్నాథం వేపు చూస్తాడు. రాజుతో) అసలు మన వాడు గనక ఓ పావుగంట ముందుగా అక్కడకు వెళ్లి వుంటే హత్యలే జరిగేవి కావనుకుంటా. చాలా గమ్మత్తు కేసులే, విను. (జగన్నాథంతో) వూఁ !

జగ:- (రాజువేపు తన దృష్టిని త్రిప్పి) హత్య జరిగిన రాత్రి అంటే బుధవారం రాత్రి నేను యాదాలాపంగా కాబూలీ వాడింటికి వెళ్ళాను. (ఆగుతాడు. రాజు చెవులు రిక్కించి వింటూన్నా, ఆసక్తి లేని వాడిలా ఎక్కడనో చూస్తున్నట్లు నటిస్తాడు)

రవణ:- (రాజుతో) కాబూలీవాడు దొంగ వస్తువుల్ని కొంటూన్నాడని పోలీసులు అంతకు మునుపే వాడి పైన ఓ కన్నేసి వుంచారు రాజూ! వాడుండే పాడు పడ్డ మేడ నీకు తెలియదూ! ఏడిసినట్లేవుంది—నువ్వూ అప్పుకోసం వాడి దగ్గరకు వెడుతుంటావుగా, వాడే!

జగ:- (రాజుతో) ఓ! మీరూ అప్పుడప్పుడక్కడ అప్పు తీసుకునే వారన్నమాట!

రవణ:- అప్పు డప్పు డేమిటి? ఎప్పుడు డబ్బులేకపోతే అప్పుడు మా వాడి వాచీ, సిగరెట్ కేస్, వుంగరం, ఏమయి పోయేవనుకున్నావ్? [రాజు నవ్వుతాడు.] అబ్బ! ముందా తలుపు సంగతి చెప్పవోయి!

జగ:- ఓ! అదా! చెబుతున్నా [లేచి సిగరెట్ వెల్గించుకుని పచారు చేస్తూ] నే నక్కడకు వెళ్ళేసరికి కాబూలీ వాడి వాటా తలుపు లోపల్నుంచి గడియ వేసుంది. రెండుసార్లు తట్టినా సమాధానం రాలేదు. నిద్ర పోతున్నాడంటే అప్పటికి ఎనిమిదే అయివుంటుంది. అనుమానం వేసి, మేడ మెట్లు దిగి, జనాన్ని తీసుకుని పైకి వెళ్ళే సరికి గది తలుపులు దగ్గరగా వేసివుంది.

లోపల గడియూ లేదు, ఏం లేదు. నేలపై రక్తంలో రెండు శవాలు మాత్రం పడి వున్నాయి.

రవణ:- (రాజుతో) ఆ సమయంలో ఆ ప్రాంతాన వెళ్లవేసే రంగయ్య తప్ప మరెవ్వరూ లేరుగనక, వాడే హంతకుడని మన యినస్పెక్టర్ సిద్ధాంతం. కాని నేననేది మరోడెవరో వున్నాడని! మన యినస్పెక్టర్ తలుపు కొడుతున్నంతసేపూ లోపల వున్నది కూడా వాడేనని. వాడు ఎవరైనా అవొచ్చుగాని రంగయ్య మాత్రం కాడు.

జగ:- (రాజునైపు తదేకంగా చూస్తూ) నేను తలుపు కొడ్తూన్నంతసేపూ, నాకు మీరిప్పుడున్నంత దూరంలో ఆ హంతకుడున్నాడని నా నమ్మకం. దడదడలాడే గుండెలతో, తలుపుకు చెవి ఆన్చి, గది లోపల పొంచుండి, ఏం జరుగుతుందా అని చూస్తూ వుండి వుంటాడు. తలుపొక్కటి అడ్డంగాని, చెయ్యి యిలా చాస్తే దొరికిపొయ్యేవాడు.

[చటాలున రాజుచేతిని పట్టుకొని వదిలేస్తాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం. రాజు వుక్కిరి బిక్కిరి అవుతాడు.]

ఏదెట్లావున్నా వాడిదగ్గర దొరికిన దుద్దుల్నిబట్టి-రంగయ్యే హంతకుడని నా ధృఢనిశ్చయం.

పోల:- (కుతూహలంతో ముందుకు ఓ అడుగువేసి) దుద్దులేమిటి అయ్యగారూ? దుద్దులు కూడా దొరికాయూ?

రవణ:- అబ్బ! నీ గోలేమిట్రా మధ్య! అవును. హత్యజరిగిన రెండోరోజున రంగయ్య యిల్లు సోదాచేస్తే కాబూలీ యింట్లో పోయిన దుద్దులు దొరికాయి. (రాజుతో)

అదేముందోయ్ - పెద్ద సాక్ష్యమేమీకాదు. అసలేం జరిగివుంటుందో నేను చెబుతాను విను.

జగ:- (భుజాలెగరేసి) ఊఁ ! అయితే చెప్పు. నేనూ వింటాను.

రవణ:- వెల్లవేసే గదిముందు దుద్దులు పడివుండగా చూసి ఆశతో వాటిని తీసుకున్నానని రంగయ్య చెబుతున్నాడా లేదా ?

జగ:- ఊఁ ! చెబుతున్నాడు.

రవణ:- ఆ మాట ముమ్మాటికీ నిజం అంటా ! జరిగింది అంతే కూడాను.

జగ:- ఎట్లాగంటాను ? పై అంతస్థులో ఎక్కడో హత్యలు జరిగితే, క్రింద అంతస్థు దగ్గిరకి దుద్దులెట్లా వచ్చి పడుంటాయో చెబుదూ ?

రవణ:- అదే చెబుతున్నా. మొన్న బుధవారంనాడు, రంగయ్య మేడకి రంగు వేస్తున్నాడు. ఆరోజుతో ఎట్లాగైనా పూర్తిచేసెయ్యాలని చీకటి పడ్డాక కూడా అంటే ఎనిమిదింటివరకు రంగు వేసేసి, హడావుడిగ వెళ్ళిపోయాడు. మరో అరగంట తర్వాత అంటే ఎనిమిదిన్నర గంటలకి, సున్నపు డబ్బాలు బయటే మర్చిపోయిన సంగతి గుర్తుకొచ్చి, లోపల పడేసి పోదామని తిరిగి వచ్చాడు రంగయ్య. అప్పుడే అతనికి దుద్దులు కింద గుమ్మంవద్ద పడి వుండటం కన్పించాయి. దాన్నిబట్టి తెలియడంలేదా - హంతకుడు హత్యలు చేసి నగలతో పారిపోతుండగా, క్రింద గుమ్మంలో దుద్దులుజత జారిపోయి వుండొచ్చని ?

రాజు:- (కుర్చీలో కదుల్తూ) దుద్దులు క్రింది తలుపు దగ్గిర దొరికాయా ?

జగ:- అవును. ఏం ?

రాజు:- ఏమీలేదు. (ఎక్కడికో శూన్యంలోకి చూస్తుంటాడు)

రవణ:- వాణ్ణి వొదిలెయ్యిలే - వాడేదో పరధ్యానంలో పడ్డాడు.

జగ:- అయితే రంగయ్య ఎనిమిది, ఎనిమిదిన్నర మధ్య ఎక్కడున్నాడంటావు ?

రవణ:- పచ్చ మేడదగ్గర్నుంచి కాకా హోటలుకు వెళ్ళడానికి 5 నిమిషాలన్నా పడుతుందా ? అక్కడ 'టీ' తాగడం పదినిమిషాలు పడితే, మళ్ళా తిరిగి రావడానికి యింకో 5 నిమిషాలు పడుతుందా ? 8-20 వరకు వాడేం చేస్తున్నాడో-తెలుస్తూనే వుంది. కావలిస్తే కాకా హోటలు వాడ్ని విచారించు. పోతే, నువ్వు మేడమీదకు వెళ్ళేసరికి 8 గం. అయ్యుంటుందంటున్నావా ? అప్పటికి హంతకుడు నీ లెఖ్ఖప్రకారమే లోపల వున్నాడు కదా ? అయినప్పుడు, 8-5 నిమిషాలకి కాకా హోటల్లో వున్న రంగయ్య హంతకుడెట్లా అవుతాడోయ్ ?

పోల:- భలే సెప్పేరుబాబూ ! అంతే అయ్యుండాలి. (మేడపైనుంచి సత్రం గుమాస్తా-"పోలయ్యా ! పోలయ్యా ! ఎక్కడ చచ్చావురా ?" అని కేకవేస్తాడు) అబ్బబ్బ ! మాంచి రసపట్టులో—(గొణుక్కుంటూ మెట్లపైకి పరుగెడతాడు పోలయ్య.)

రవణ:— జరిగిన సంగతయితే—నువ్వేనో మధ్య ఏ పాపమూ ఎరగని రంగయ్యని జైలుకు పంపిస్తానంటున్నావు చూశావా?

[జగన్నాధం నవ్వి వూరుకుంటాడు. ఇంతలో సాంబయ్య హాలులోకి వస్తాడు. అతని వేషధారణ - ప్రత్యేకం యీ పనికోసం ముస్తాబయి వచ్చినట్లు కన్పిస్తూంటుంది. అతను అటూ యిటూ చూసి, ఎవ్వరూ కన్పించకపోగా రాజు గదిముందు కొచ్చి ఆగుతాడు. రవణని చూసి]

సాంబ:— ఇక్కడెక్కడో రాజశేఖరం అనే చదువుకునే కుర్రాడున్నాట్ట. ఎక్కడో తెలుసా ?

రవణ:— (ప్రిజుడిస్ అయి) ఇక్కడ చదువుకునే రాజశేఖరం లేడు. చదువు మానేసిన రాజశేఖరం వున్నాడు.

సాంబ:— పోనీ చదువు మానేసిన రాజశేఖరం. ఎక్కడ ?

రవణ :— ఓ ! అయితే అతనే రాజశేఖర్. ఏంపని ?

రాజు :— నువ్వుండవోయ్ రవణా ! నేనే రాజశేఖర్ని. మీ రెవ్వరు ?

సాంబ:— (చిరునవ్వుతో) నా పేరు మీరు వినేవుంటారు. సాంబయ్య. మాది కృష్ణాపురం. మీ వూరికి 12 మైళ్లు.

[రాజు ఆ పేరునే విననట్లు అతనివైపోసారి చూసి, కుర్చీలో వెనక్కి జేర్లబడి, సీలింగ్వైపు చూస్తూ ఆలోచనలో పడతాడు.]

రవణ:— ఓ సాంబయ్యగారా ! దయచెయ్యండ. ముందు కూర్చోండి. మావాడి వొంట్లో కొన్నాళ్ళనుంచి బాగుండటంలేదు, ఏమీ అనుకోకండి.

సాంబ:— (జగన్నాథాన్ని చూపి) వీ రెవ్వరు ?

రవణ :- ఓ! ఈపూన మనకి కావలసినవాడే లెండి. నా మిత్రుడు జగన్నాధంగారు. మీరు మాట్లాడాల్సిన దేమైనావుంటే నిరభ్యంతరంగా మాట్లాడొచ్చు.

సాంబ:- పోనీ మరోసారి...

రవణ :- అదేమిటట్లా మొహమాటపడ్తారు. మీ రాకవల్ల మావాడికి కాస్త కాలక్షేపంకూడా కావచ్చు.

[రవణ తనని 'యద్దేవా' చేస్తున్నాడా అన్న అనుమానంతో సాంబయ్య రవణ నోసారి నిశితంగా చూసి, రవణని లెఖ్కచెయ్య కూడదనే నిశ్చయంతో రాజువైపు తిరుగుతాడు.]

సాంబ:- ఊళ్ళో కొన్ని ముఖ్యమైన పనులుండి యిన్నాళ్ళు మిమ్మల్ని కలుసుకోలేకపోయే. మీ అమ్మగారు—

రాజు:- (ఆదుర్దాతో) వచ్చిందా ?

సాంబ:- ఇవ్వాళ్ళనే వచ్చారు. ఇక్కడ ఆట్టే సౌకర్యంగా వుండదని మరోచోట బస ఏర్పాటుచేశాను.

రాజు:- ఎక్కడ ?

సాంబ:- ఇక్కడికి దగ్గిరలోనే ! చంచయ్యగారి డాబాలో.

రవణ:- (కోపంతో) ఆవిడకి చంచయ్యగారింట్లో బస యేర్పాటు చేసారా ?

రాజు:- కుక్కలుకూడా వుండటానికి వప్పుకోని ఆ దౌర్భాగ్యపు చంచయ్య యింట్లోనా ?

సాంబ:- ఆ యింటికేం ? ఈ యింటికంటే చాలా శుభ్రంగా వుంటుంది.

రవణ:- (హేళనగా) నిజం ?

రాజు:- అది సరేగాని, మా చెల్లెలు బీదదన్న విషయం మీకుచాలా ఆనందంగా వుండటగా !

సాంబ:- క్షమించాలి. మీరనేదేమిటో నాకర్థం కావటం లేదు.

రాజు:- అర్థంకాలేదూ? ధనవంతు డెప్పుడూ బీదపిల్లని పెళ్లాడితే ఆ వధువెప్పుడూ భర్తకి కృతజ్ఞురాలై పడి వుంటుందని మా అమ్మకి రాసారుట!

సాంబ:- నే నెప్పుడూ అట్లా అనలేదు. బహుశా మీ అమ్మగారు ఆక్టో చదువుకోకపోవటంవల్ల నన్ను సరిగా అర్థం చేసుకోలేకపోయి వుండొచ్చు.

రాజు:- (కోపంతో) మా అమ్మని గురించి మళ్ళీ వక్క ముక్క అన్నావంటే బయటకి పంపిస్తాను, జాగ్రత్త.

సాంబ:- ఆఁ!

రాజు:- ఆఁ!

జగ:- రాజూ!

సాంబ:- (హుందాగా లేచి నుంచుని, జగన్నాథంతో) చూసారా యీ మనిషి ప్రవర్తన! నే నిక్కడికి వచ్చి నప్పట్నుంచీ యీతని ప్రవర్తన గమనిస్తూనే వున్నా. మొదట జ్వరంవల్లనేమో ననుకున్నా.

రాజు:- నీకేమైనా జ్వరంగా వుందేమో; నాకేమీలేదు.

సాంబ:- అయితే నీ ప్రవర్తనకి అర్థంలేదు.

రాజు:- ఇంకా మాట్లాడుతున్నావా? 'గెటవుట్' (గట్టిగా) 'గెటవుట్.'

సాంబ:- (చలించనట్లు కన్పించాలని ప్రయత్నిస్తూ, గది బయటకు నడుస్తూ అతి శాంతంగా) పెద్దమనుష్యులెవ్వరూ యిట్లా అరవరు.

రాజు:- ముందు వెళ్తావా; వెళ్ళవా ? ఊఁ !

సాంబ:- (గుమ్మంవద్ద ఆగి) వెళ్ళక ఆగుతాననుకుంటున్నావా! అయినా నీతో నాకేమిటి ? అన్నీ మీ అమ్మతోటే తేల్చుకుంటాను.

[రాజు సాంబయ్యమీదకు దూకబోగా, జగన్నాథం రాజుని ఆపి కూర్చోబెడతాడు.]

జగ:- ఏమిటి ? మరీ కుర్రాడయిపోతున్నారు !

(రాజు కూర్చున్నాక, రవణ, జగన్నాథం ముఖముఖాలు చూసుకుంటారు. ఈ లోగా సాంబయ్య హాలులోకి వస్తాడు. సత్యం గుమస్తా యెదురయ్యి.)

స.గు:- గదులేమన్నా కావాలా బాబూ ! కిందంతా అలగా జనం వుండేవి. పైన ఫస్టుగా వుంటాయి. వచ్చి చూడండి.

సాంబ:- పైన గదులుకూడా వున్నాయా ? (వెనక్కి తిరిగి ఓసారి చూసి) ఇక్కడుంటే బాగానే వుండేట్లుంది. మా రాజునికూడా చూస్తూండవచ్చు. నడవండి చూద్దాం. (మెల్లెక్కి పైకి వెడతారు యిద్దరూ.)

రవణ:- (లేచి ఆలోచిస్తూ అటు యిటు తిరిగి) మా మామ వున్నాడు చూడు. ఆయనివ్వేళ చిన్న 'డిన్నర్ ఎరేన్‌జి' చేశాడు. 'సూపర్‌విజన్' అంతా నా నెత్తిన పెట్టాడు. (రాజుతో) నీ వంట్లో బాగుంటే నిన్నూ పిల్చేవాణ్ణేగాని, నువ్వు వద్దులే ! శుభ్రంగా 'రెస్టు' తీసుకో. (రాజు మాట్లాడడు. జగన్నాథంతో) నువ్వు మాత్రం తప్పక రావాలిసుమ్మా !

జగ:- నేనా ! 'థాంక్స్'. నాకు బోలెడు పనుంది.

రవణ:- అట్లా తప్పించుకు పోవడానికి వీల్లేదు. మా మామ నిన్ను యెట్లాగైనా తీసుకురమ్మనమని మరీ మరీ చెప్పాడు. ఊఁ ! (లేవమని సంజ్ఞ చేస్తాడు)

జగ:- చూద్దాంలే. (లేచి) నా కింకా కొంచెం స్టేషన్‌కి వెళ్లాల్సిన పనుంది. (రాజుతో) 'గుడ్-బై మిస్టర్ రాజు'

రాజు:- (హీనస్వరంతో) 'గుడ్-బై'.

(రవణ, జగన్నాధంతో హాల్లోకి వస్తాడు, తలుపును దగ్గరగా మూసి. రాజు వెంటనే లేచి, తలుపుదగ్గర చెవి ఒగ్గి, హాల్లో రవణ జగన్నాధం మాట్లాడుకునే మాటలు ఆదుర్దాగా వింటూంటాడు.)

జగ:- (తలుపు యివతల ఆగి, అనవసరంగా బిగ్గరగా) ఈ హత్యల్ని గురించి మా చీఫ్‌కి మరో 'థియరీ' వుంది తెల్సా ? కాబూలీవాణ్ణి ఎవరో వాడి క్లయింటే హత్య చేసి వుండాలంటాడాయన. వాడిదగ్గర తాకట్లు పెట్టేవాళ్ళనూ, అప్పులు తీసుకునేవాళ్ళనూ అందర్నీ పరీక్ష చెయ్యాలంటున్నాడు.

రవణ:- అట్లా అప్పులు తీసుకునేవాళ్లు వకళ్ళా యిద్దరా ? అయినా వాళ్ళందరి పేర్లూ యీయన కెక్కడ దొరుకుతాయి ?

జగ:- మరట్లా అడుగు-చెబుతాను. ఖాన్ యింట్లో ఓ రిజిష్టరుంది. అందులో ఎడ్రసులతోను, సంతకాలతోను అందరి పేర్లూ వున్నాయి. (వీధి గుమ్మంవరకు వచ్చిన వాడు ఆగిపోయి) 'సారీ'! లోపల నా సిగరెట్ కేస్ మర్చిపోయా. తిన్నగా నువ్వు మీమామ యింటికేగా! పదుస్తాండు. నేను స్టేషన్‌కి వెళ్ళి వస్తాను.

రవణ:— ఏడిసినట్లే వుంది. ఆనక తప్పక రావాలిసుమా! మరి . నేను వెళ్తా.

జగ :— ఓ కె!

[రవణ బయటికి వెళ్ళిపోతాడు. జగన్నాథం వెనక్కి తిరిగివచ్చి వక్కక్షణం రాజు గుమ్మం ముందు ఆగి లోపలకి వెళ్తాడు. రాజు ఏమీ ఎరగనట్లే 'ఈజీచైర్ లో' కూర్చుని 'న్యూస్‌పేపర్' చూస్తుంటాడు]

రాజు:— (ఆశ్చర్యం నటిస్తూ) ఓ–మీరా?

జగ :— 'డిస్ట్రబ్' చేసినట్లున్నా! ఆఁ–మ రేం లేదు, యిక్క–డెక్క–డో నా సిగరెట్ కేస్ మరిచిపోయా–(అటు ఇటు వెతికినట్లు నటించి) ఓ యివ్వాళ అసలు తేవడమే మరిచిపోయాననుకుంటా! చూడండి–మా• మతులిట్లా వుంటాయి! ఏమిటో చాలా శ్రద్ధగా చదివేస్తున్నారు. విమాన ప్రమాదమా ఎక్క–డైనా?

[రాజు జగన్నాథాన్ని వింతగా చూసి చిరునవ్వు నవ్వుతాడు]

జగ :— ఏం అట్లా నవ్వారు?

రాజు:— నామీద ఆకస్మికంగా మీకింత శ్రద్ధ ఎందుకా అని!

జగ :— మీ వుద్దేశం నా కర్థంకాలేదు.

రాజు:— శ్రద్ధ కాకపోతే మళ్ళీ వెనక్కి వస్తారా? సిగరెట్ కేస్ దొరికిందా? నే నేం చదువుతున్నానో తెల్సిందా? ఇంత అవస్థ యెందుకు? తిన్నగా నన్నడిగితే చెప్పనూ? చెప్పనా? మీరు రాబోయేముందు నేను ఖాన్ హత్యా వివరాలు చదువుతున్నా. సరేనా?

(క్రమేపీ రాజు కంఠస్వరం హీనమైపోయింది. అతని దృష్టి మాత్రం జగన్నాథంపైనే నిల్చివుంటుంది. జగన్నాథం రాజుని వింతగా చూసి, చూపును నేలపైకి నిగిడ్చి)

జగ :- ఓ ! హత్యా వివరాలా! అయినా అందులో ఆశ్చర్యం ఏముంది ?

రాజు:- (విరగబడి నవ్వేస్తాడు)

జగ:- (బాఫిల్ అయి) చూడండి, మీకు మతైనా పోయుండాలి, లేకపోతే___

రాజు:- (కష్టంపైన నవ్వునాపుకుని) ఊఁ ! లేకపోతే, ఏమిటో చెప్పండి. అదీవిని సంతోషిస్తాను.

జగ:- (చిరునవ్వుతో) దానికేంగాని, ఆ హంతకుడు యెంత చతురుడైనా వరసగా రెండు హత్యలు చెయ్యడంతో కాస్తయినా 'బ్యాలన్స్' తప్పి వుండదంటావా ?

రాజు:- ఏమో-వాడికి 'బ్యాలన్స్' తప్పితే మీకూ తెలికేగా! పట్టుకోకూడదూ ?

జగ:- పట్టుకుంటాం. తొందరపడితే యెలా ?

రాజు:- (నవ్వి) ఎట్లా పట్టుకుంటారో చెబుదురూ, విని ఆనందిస్తాను.

(ఈ సమయంలో కల్పన బయటినుంచి హాల్లోకి వచ్చి తన గదిలోకి వెళుతుంది.)

జగ:- హంతకులు, చోరులు, సాధారణంగా చేసే పెద్ద పొరపాటేమిటో తెలుసా ! విచ్చలవిడిగా వాళ్ళు డబ్బును ఖర్చుపెట్టేస్తారు. దాంతో అనవసరంగా పోలీసుల దృష్టి వాళ్ళమీద పడుతుంది. నాకొకటి తెలుసుకోవాలని వుంది. మీరు చాలా తెలివికలవారు ! మీరే ఆ పొజిషన్‌లో వుంటే ఏంచేస్తారు ?

రాజు:- నేనేంచేస్తే మీకెందుకో చెబుదురూ ?

జగ :- (తబ్బిబ్బై) అబ్బే వూరికేనే 'ఫ్రండ్లీ'గా అడిగాను.

రాజు:- (కవ్విస్తూ) నిజం ?
జగ :- (నవ్వేస్తూ) నిజంగానే !
రాజు:- అయితే చెప్పాల్సిందే ! (లేచి వుత్సాహాన్ని తెచ్చుకుని అటు యిటు తిరుగుతూ) హత్యచేశాక డబ్బు, దస్కం తీసుకుని, నడిచి నడిచి ఓ నిర్జన ప్రదేశాన్ని చేరుకుంటాను. ఆ చుట్టుపట్ల ఎక్కడైనా పెద్ద బండ రాయి కన్పిస్తుందేమోనని చాలా ప్రశాంతంగా వెతుకుతాను. నా బలాన్నంతా వుపయోగించి ఆ రాతిని ఓ పక్కకి కాస్త జరిపి, నేలలో ఓ గోతిని తీస్తాను. వింటున్నారా? ఆ నగలను, డబ్బును గోతిలో పడేసి, మట్టితో ఆ గోతిని పూడ్చేసి, బండరాతిని యథాస్థానానికి జరుపుతాను. ఏమీ ఎరగనట్లు ఇంటికి వచ్చేస్తాను. నే నసలు రెండు మూడేళ్ళవరకు ఆ ప్రదేశంవైపుకే పోను. పోలీసులొచ్చి యిల్లంతా ఎంత వెదికితే మాత్రం ఆ నగలు ఎక్కడ దొరుకుతాయి ? (తెప్పరిల్లి) ఎట్లావుంది ?

(తీక్షణంగా చూస్తూ, కొద్దిగా జగన్నాథం ముఖం మీదికి వంగుతాడు)

జగ :- (రెండడుగులు వెనక్కివేసి) 'హారిబుల్' నువ్వు-నువ్వు వెర్రాడివి. నిజంగా వెర్రాడివి !

(రాజు అదే 'పొజిషన్'లో వుండి పెదవులు కదుపుతూంటాడు. మాటలు మాత్రం బయటకు విన్పించవు.)

రాజు:- (వెంటనే గొణుగుతూ) ఖాన్ని, ఓ వేళ నేనే చంపివుంటే?
జగ :- (స్టన్ అయి) నువ్వా 'ఇంపాజ్‌బుల్' !
రాజు:- (నవ్వుతాడు)

జగ :- ('టెన్షన్' భరించలేనట్లు) ఇదివరకైతే నమ్మేవాణ్ణే మోగాని యిప్పుడసలు 'ఇంపాజ్‌బుల్'

రాజు:- ఓహ్ ! దొరికిపోయారు ! ఇదివరకు కొద్దిగా నమ్మే రన్నమాట.

జగ :- 'సారీ' నా వుద్దేశం అది కాదు. (తడుముకుంటూ) నేను - నేను సరిగా 'యక్స్‌ప్రెస్' చెయ్యలేక పోయాను.

రాజు:- (ఓ అడుగు వెనక్కి వేసి, ఏదో గుర్తుకొచ్చినట్లయి) 'సారీ, ఐ కెనాట్ వేస్టు మై టైమ్ ఎనీమోర్'. నేను ఊళ్లోకి వెళ్ళాలి. కావలిస్తే మీరు సావకాశంగా నా రూం అంతా సోదా చేసుకోవచ్చు. నా వుత్తరా లన్నీ చదువుకోవచ్చు. 'ఐ డోన్ట్ కేర్'.

జగ :- సారీ ! మీరు నన్ను అపార్థం చేసుకున్నారు. నేనే వెళ్తున్నా. తీరిగ్గా వున్నప్పుడు మళ్ళా కల్సుకుందాం.

(జగన్నాధం బైటికి వెళ్ళిపోతాడు. రాజు సిగరెట్ వెల్గించుకుని మఫ్లర్ మెడకి చుట్టుకుని హాల్లోకి వస్తాడు. అప్పుడే, కల్పన వాటా లోంచి వచ్చి, నందులోకి వెళ్ళబోతున్న చిట్టిని చూస్తాడు రాజు! రాజు ఆగిపోయి.)

రాజు:- పాపా ! నీ పేరేమిటమ్మా ?

చిట్టి :- చిట్టి.

రాజు:- (రాజు చిట్టిని లాలనగా దగ్గరకుతీసి) భోంచేశావా చిట్టి ?

చిట్టి :- లేదు. ఇంకా అక్కయ్య వంటచేస్తోందిగా ! అవ్వ గానే పిల్చి పెట్టేస్తుంది. ఉండు బాబుతో ఆడుకోవాలి

రాజు:- (నవ్వుతూ) అట్లాగే ఆడుకుంటువుగాని. మీ అక్క నిన్నెప్పుడైనా కోప్పడుతుందా ?

చిట్టి :- ఊహుఁ ! అక్క ఏమీ అనదు. అమ్మే నన్ను కొడుతుంది.

రాజు:- అవును. మీఅక్క దేవత! ఆఁ! మీఅమ్మ ఏంచేస్తోందమ్మా. లేచి తిరుగుతోందా ?

చిట్టి :- లేదు. అమ్మకి జ్వరంగా ?

రాజు:- ఇదిగో యీ డబ్బు తీసుకెళ్ళి మీ అమ్మకి ఇస్తావూ ? (జేబులోంచి మూడు నోట్లుతీసి చిట్టి చేతికిస్తాడు.)

చిట్టి :- డబ్బా ! ఓ—(తీసుకుంటుంది)

(మెట్లపైనుంచి యిదంతా సాంబయ్య గమనించి తలూపుతుండగా కల్పన లోపల్నుంచి ,'చిట్టీ—చిట్టీ" అంటూ హాల్లోకి వస్తుంది. రాజుని చూసి ఆగిపోతుంది.)

చిట్టి:- అక్కా డబ్బే !

కల్ప:- అదేమిటండీ మీ డబ్బు మా కెందుకు ? చిట్టీ అది ఆయనకి యిచ్చెయ్యి !
(చిట్టి తిరిగి యిచ్చెయ్య బోతుంది.)

రాజు:- (వారిస్తూ)మీఅమ్మ మందులకి వాడమని యిచ్చాను. వుండనీ, కల్పనా ! ( చిట్టితో) వెళ్ళి మీ అమ్మకి యిచ్చెయ్యి ! (చిట్టి లోపలకు డబ్బుతో పారిపోతుంది "అమ్మా ! డబ్బే డబ్బు" అంటూ.)

కల్ప:- మీకు నా కృతజ్ఞత——— (ఇంతలో వర్కర్ సూరన్న బయటనుంచి ఆదుర్దాగా ప్రవేశిస్తాడు.)

సూర:- (కల్పనతో) మీ నాన్నగారు నడుస్తూ నడుస్తూ లారీ క్రింద పడిపోయారు! తలంతా రక్తంతో తడిసి ముద్దయి పోయింది. అమ్మగారూ— (ఆదుర్దాగా కల్పన వాటాలోకి వెళ్ళబోతాడు.)

రాజు:- (చటాలున సూరన్నని జబ్బ పుచ్చుకుని ఆపి) ఇష్— అరవకు! అసలే జబ్బుతో వున్న ఆయనభార్య గుండె ఆగిపోగలదు.

కల్పు:- ఆఁ! నాన్నగారా? ఎక్కడ?

సూర:- (జాలిగాచూస్తూ) నెహ్రూ చౌక్‌లో! తూలు కుంటూ వెళ్ళి లారీ కింద పడిపోయేరు. అక్కడి వాళ్ళంతా హాస్పటలులో చేర్పిస్తే నేనిట్లా పరుగెత్తు కొచ్చాను.

రాజు:- అది సరేనోయ్. పరిస్థితి ఎట్లావుంది.?

సూర:— అదేమోనండి. నోటమ్మట మాటమాత్రం లేదు. కళ్ళుమూసుకు పడున్నారు.

(చిట్టివచ్చి కల్పన ప్రక్కనే నిలబడుతుంది. కల్పన అయోమయావస్థలో పడి, భయంతో చేతులు నులుపుకుంటూ వుంటుంది.)

రాజు:- నువ్వేం భయపడకు కల్పనా! ఇతనితో హాస్పటల్‌కి వెళ్ళి చూసిరా! నేనూ నీ వెనకే వస్తా.

(సాంబయ్య ఇది గమనించి తల ఎగరేసి, పెద్దగా చప్పుడు చేస్తూ మెట్లు దిగి బయటకు వెళ్ళిపోతాడు. రాజు అతనిని చూస్తాడు గాని పట్టించుకోడు.)

సూర:- (కల్పనతో) వస్తున్నావా?

కల్పన:- వస్తున్నా!

(రాజువైపో సారి కృతజ్ఞతతో చూసి, కళ్ళొత్తుకుంటూ సూరన్నతో బయటికి వెళ్ళిపోతుంది. రాజు వాళ్ళు వెళ్ళినదిక్కే వక్క క్షణం చూసి, సిగరెట్ వెల్గించుకుని లోపలికొచ్చి బల్లమీదున్న 5 రూ॥లు కాగితాన్ని జేబులో పెట్టుకొని హాల్లోకి వస్తాడు. ఇంతలో రోజుకుంటూ బయటనుంచి ఆచారి వస్తాడు.)

రాజు:- (ఎగా దిగా చూస్తూ) ఏమిటా గాబరా ?

ఆచా:- నారాయణగారు లారీకింద పడి పోయారుసార్ ! కల్పనకోసం కలవరిస్తున్నాడాయన.

రాజు:- కల్పన యిప్పుడే సూరన్నతో హాస్పటల్‌కు వెళ్ళిందే ! అక్కడింకా మనవాళ్ళెవరైనా వున్నారా ?

ఆచా:- ఎవరుంటారు? పోలీసులున్నారు.

రాజు:- పోలీసులా ? వాళ్ళెందుకు - అక్కడ ?

ఆచా:- ప్రమాదం తన తప్పువల్లే జరిగిందని స్టేటుమెంటిమ్మని కొరుక్కు తింటానికి, ఇంకెందుకు ? అయితే కల్పన వెళ్ళిందన్నమాట - పోన్లెండి, ఆఖరి చూపైనా అందితే !

రాజు:- అంత ప్రమాదంగా వుందా ?

ఆచా:- చావు బ్రతుకులు ఎవరుచూసేరు సార్ !

(ఆచారి లోపలకు వెళ్ళిపోతాడు.)

రాజు:- (గొణుక్కుంటూ) పోలీసులు ! అక్కడకూడానా !

[కాసేపు తటపటాయించి, వెనక్కి వచ్చి, 'మఫ్లర్' తీసేసి బల్లపైన పడేసి, దీపం వెలిగించి కుర్చీలో జేర్లగిలబడి పడుకుంటాడు.]

[తెర వాలుతుంది.]

# మూడవ రంగము

(మళ్ళా తెరలేచే సరికి తెల్లవారుతుంది. రాజింకా కుర్చీలోనే నిద్ర పోతూంటాడు. ఎక్కడో లోపల్నుంచి ఆచారి మధురంగా ఫిడేలుమీద సాధన చేస్తూంటాడు. పోలయ్య మెట్లమీద నుంచి దిగి, రాజు గదిలోకి వచ్చి దీపం తగ్గించి హాలు వెనక్కి వెళ్ళిపోతాడు.

రాజు కుర్చీలో 'అనీజీ' గా కదుల్తూంటాడు. శాంతమ్మ నెమ్మదిగా హాల్లోకి వచ్చి అటు ఇటు చూసి, రాజు గది వేపు చూస్తుంది. రాజు కన్పిస్తాడు.

ఆమె ఒక్క క్షణం ఆశ్చర్యంతో స్తబ్దుగా నిలబడిపోయి, మరు క్షణానే తేరుకుని గుమ్మం లోపలకు రెండడుగులు వేసి రాజుని ఆనందంతో చూస్తూ మళ్ళీ నిలబడి పోతుంది.

రాజు కళ్ళుమూసుకునే బద్ధకంగా వళ్ళు విరుచుకుని, ఆవలిస్తూ లేచి చూడగానే తల్లి కన్పిస్తుంది. చటాలున "అమ్మా" అంటూ రెండడుగులు ముందుకు వేసి, ఏదో గుర్తుకు వచ్చినట్లయి, నిశ్చలంగా నిలబడి పోతాడు.)

శాంత:— రాజూ! మళ్ళీ ఎన్నాళ్ళకు చూసానురా నిన్ను! ఏమిటిట్లా చిక్కిపోయావు? వంట్లో బాగుండటం లేదా?

రాజు:— ముందు అట్లా కూర్చో అమ్మా! (శాంతమ్మ కూర్చున్న తర్వాత తనూ కూర్చుని రెండు క్షణాల తర్వాత.) ఏం లేదమ్మా! కొంచెం నలతగా వుంది... అదే తగ్గి పోతుందిలే!

శాంత:— ఒట్టి నలతేకదా? (అని నిట్టూర్చి) నిన్నెప్పుడు చూస్తానా అని యిన్నాళ్లూ యీ కళ్లు కాయలు కాసిపోయాయిరా!

రాజు:- అది సరే గాని, ఎప్పుడమ్మా నువ్వు వచ్చింది.

శాంత:- నిన్న వుదయం — మెయిల్లో వచ్చేనురా! నీ కిక్కడ యిబ్బంది ఎందుకని సాంబయ్య గారు చూపించిన యింట్లో దిగేను-ఇక్కడికి బాగా దగ్గరే! (రాజు నిశ్శబ్దంగా వుండటం గమనించి, కోపం వచ్చిం దనుకుని) నీకు కోపం వస్తుందని నాకూ తెలుసు. కాని ఏం చెయ్యను? ఈ చిన్న గదిలో నేను కూడా వచ్చి వుంటే నీకు అవస్థకదూ? అక్కడ బాగా సౌకర్యంగానే వుందనుకో.

రాజు:- చెల్లి ఎట్లా వుందమ్మా? కులాసా యేనా?

శాంత:- ఆఁ! కులాసాగానే వుంది. అదికూడా నిన్నెప్పుడు చూస్తానా అని బెంగ పెట్టుకుని యిదయి పోతూంది.

రాజు:- మన యింటి పక్కవాళ్ళంతా కులాసాగా వున్నారా అమ్మా?

శాంత:- ఆఁ! అంతా కులాసాగానే వున్నార్రా!

రాజు:- ఇంకా మనవూరి సంగతు లేమిటమ్మా?

శాంత:- ఏమున్నాయి నాయనా, అంతా బాగానే వున్నారు.

రాజు:- పోలయ్యా...పోలయ్యా! (పోలయ్య ప్రవేశిస్తాడు.) రెండు కాఫీలు తీసుకురా!

శాంత:- నాకు కాఫీ ఎందుకురా? [వెళ్ళబోయిన పోలయ్య ఆగుతాడు.]

రాజు:- పోయి తీసుకు రారా! [పోలయ్య బయటకు వెళ్ళి పోతాడు.] ఇవ్వాళ నా చేత్తో యిచ్చిన కాఫీ నువ్వు తాగాలమ్మా! [కొన్ని క్షణాలు నిశ్శబ్దం.]

శాంత:- [నిశ్శబ్దాన్ని ఛేదించడానికి ఏదో ఒకటి మాట్లాడాలని] రాజూ ! సీతమ్మగారు పోయిన సంగతి విన్నావు కదూ ?

రాజు:- సీతమ్మా ! ఆవిడెవరమ్మా ?

శాంత:- ఏమిట్రా, సీతమ్మగార్నెరగవూ ? మన సందు మొదట్లో యిల్లు. క్రిందటిసారి రాసిన వుత్తరంలో కూడా ఆవిడ అవస్థలూ అవ్వీ రాసాను.

రాజు:- ఓ ! ఆవిడా ? పాపం - ఎట్లా పోయిందమ్మా ?

శాంత:- మనవూరి చివర తామర కోనేరు లేదూ - అందులో కాలుజారి పడి చని పోయిందిరా ! మొగుడు రోజూ నానావిధాల హింస పెడ్తూంటే భరించలేక చెరువులో పడిందని కొందరంటారు. నిజమేమిటో ఆ దైవానికే తెలియాలి. ఎందుకైతేనేం పాపం, మంచి మంది.

రాజు:- (ఏదో ఆలోచిస్తూ, చటాలున) అమ్మా ! మనకీ పాడు చావు కబుర్లకంటే మాట్లాడుకోడానికి మరో విషయమే లేదా ?

శాంత:- ఊళ్లో సంగతేమిటని నువ్వే అడిగావు కదుట్రా ? అయినా నీతో ఏం మాట్లాడాలో, ఏం మాట్లాడ కూడదో నాకు యిప్పటికీ అర్థం కాదురా !

[రాజు విషాదంగా నవ్వి వూరుకుంటాడు. పోలయ్య రెండు గ్లాసులతో కాఫీ తెచ్చి బల్లమీదపెట్టి వెళ్ళిపోతాడు. రాజు లేచి ఓ గ్లాసు తల్లి చేతికిచ్చి, మరొకటి తాగుతూంటాడు.]

శాంత:- (కొంచెం తాగి) రైల్లో వున్నంతసేపూ నీ గురించి ఆలోచనల్లేరా ! మళ్ళీ యిన్నాళ్ళకి చూడబోతున్నాను

కదా అని ఓ మూల సంతోషం, యింతదూరం ఎందుకు వచ్చావని కోప్పడతావేమోనని మరోమూల భయపడ్డాను. ఆ సాంబయ్యగారి వ్యవహారం వంక కాకపోతే నిన్నింతలో చూసేదాన్ని రా? (మరో గుక్క కాఫీ త్రాగేసి గ్లాసును బల్లపైన పెట్టి) నిన్ను చూశాను. నీతో మాట్లాడాను. ఇంక నాకు కావల్సిందేముంది? మన విమలకి ఆ మూడుముళ్ళూ కూడా పడిపోతే యిక నా తనువు ఎట్లా వెళ్ళిపోయినా ఫర్వా లేదు.

రాజు:- (వేదనతో తల్లినిచూస్తూ) ఇష్! అట్లా అనకమ్మా! మనం అన్నీ తర్వాత మాట్లాడదాం. మనం మాట్లాడు కోడానికి బోలెడు టైముంది యింకా-

[వెంటనే ఏదో ఆలోచన వచ్చి రాజు మొహం పాలిపోతుంది. లేచి చేతులు నులుముకుంటూ అటు యిటు తిరుగుతూ, చటాలున బీధి గుమ్మంవైపు వెళ్ళబోతాడు.]

శాంత:- (ఖంగారుగా) రాజూ! అదేమిట్రా - ఎక్కడికి?

రాజు:- (ఆగిపోయి వెనక్కి వచ్చి, తొట్రుపాటుతో) ఆఁ, ఎక్కడికీ లేదమ్మా! (తల వంచుకుని కూర్చుంటాడు)

శాంత:- (విచారంగా రాజువైపు చూస్తూ) పొరపాటున నేనే మైనా అన్నానేమిట్రా?

రాజు:- అబ్బే! నువ్వేమీ అనలేదమ్మా! ఏదో పిచ్చి ఆలోచన వకటి వచ్చింది. అంతే!

[ఆందోళనతో గోళ్ళు కొరుక్కుంటూ వుంటాడు రాజు. శాంతమ్మ మాట్లాడటానికి జంకి, మౌనంగా కూర్చుంటుంది. కాస్సేపు నిశ్శబ్దం. శాంతమ్మ కొడుకు మొహాన్ని పరిశీలనగా చూస్తూంటుంది. రాజు, తల్లి చూపులు భరించలేక]

ఎందుకమ్మా అట్లా వూరికే కూర్చున్నావు? ఏదో వకటి మాట్లాడు. లేకపోతే మనం కల్సుకుని ప్రయోజనం ఏమిటి?

శాంత:- ఏమిట్రా, అట్లా ఏదో దిగులుగావున్నావు? సంగతేమిటి?

రాజు:- ఏమీ లేదమ్మా! ఊఁ! మన వూరి సంగతులు ఇంకా ఏమిటి? లక్ష్మింందేవి పెద్దకూతురికి పెళ్ళయిందా? ఆ అమ్మాయి తమ్ముడికి వుద్యోగం దొరికిందా? చెప్పమ్మా?

శాంత:- అది సరేగాని, నువ్వు మళ్ళీ చదువు ప్రారంభించి పరీక్షలకి కట్టాలిరా నాయనా! చదువు పూర్తయితే మాంచి వుద్యోగం వుందిట. నీ పై చదువులకి కావలసిన డబ్బు నే నెక్కడో అక్కడ అప్పుచేసయినా తీసుకువస్తాను.

రాజు:- చూద్దాంలే. అయినా, వుద్యోగం వుందని చెప్పిందెవరమ్మా?

శాంత:- సాంబయ్యగారి సంగతి నీకు తెలియదు. ఆయనకి వూళ్ళోనూ పట్నంలోనూ ఎంత పలుకుబడో తెలుసా? ఆయన తల్చుకుంటే నీకివ్వేళ దొరుకుతుంది-చక్కటి వుద్యోగం. కాని చదువు పూర్తయితే - (రహస్యం లాగు) ఆయన నీకు తన వ్యాపారంలో భాగం కూడా యివ్వచ్చురా!

రాజు:- నాకు అర్థం అయిందమ్మా - అంతా అర్థమయింది.

శాంత:- (ఆశ్చర్యంతో) అదేమిట్రా అట్లా అంటావు ? ఇందులో అర్థం కాకూడనిదేముంది? సాంబయ్య గారు చాలా మర్యాదస్తుడు. పెద్దమనిషి. ఆయన బోలెడు స్థితిమంతుడు. అట్లాంటి ఆయన్ని పట్టుకుని నిన్న ఏమేమో మాట్లాడావుట ! పెద్దవాళ్ళతో అట్లా గేనా మాట్లాడేది ?

రాజు:- ఓహో ! ఈ సంగతి నీవరకు వచ్చిందన్నమాట ! ఎవరు చెప్పారమ్మా ? ఆ సాంబయ్యగారేనా ? ఊఁ ! ఇంకా ఏమన్నారు ?

శాంత:- ఊఁ ! పోనిస్తూ.

రాజు:- చెప్పమ్మా - నాకు వినాలని వుంది. ఇంకా యేం చెప్పారు ?

శాంత:- ఈ ప్రక్కనుండే అమ్మాయి - దాని పేరేదో చెప్పారు. దానికి నీ డబ్బంతా యిచ్చేశావుట ! నీ కోసం అష్టకష్టాలుపడి ఆ డబ్బు పోగుచేసి పంపాను కదా ! అయినా నీ యిష్టం, నేను నీకు చెప్పేరోజులు వెళ్ళిపోయాయి. (కంటతడి పెట్టుకుని, తటపటాయి స్తూనే) పైగా, ఆ పిల్ల బుద్ధిమంతురాలు కాదుటగా !

రాజు:- ఆయనేనా ఆ మాటలంట ? 'రాస్కెల్'-

శాంత:- (మందలింపుగా) రాజూ ! ఆయనకి మన విమల నివ్వబోతున్నామని కూడా మరచిపోతున్నావు. ఏమిటా కూతలు !

రాజు:- లోకల్ బోర్డు ప్రెసిడెంట్. ఊళ్ళోనూ, పట్నంలోనూ పెద్ద పలుకుబడి. (విషాదంగా నవ్వి) కొడుక్కి చక్కటి

వుద్యోగం. ఇంకా దేవుడు మేలుచేస్తే వ్యాపారంలో వాటా! నా కంతా అర్థమయిందమ్మా!

శాంత:- ఏం మాటలురా అవి?

రాజు:- ఇన్నాళ్లూ నాకోసం తినీతినకా మీరంతా చేసిన త్యాగాలు చాలమ్మా! చాలు! ఈ త్యాగానికి నేనే మాత్రం అంగీకరించను.

శాంత:- నువ్వు పొరబడుతున్నావు. ఇందులో త్యాగమేమీ లేదురా.

రాజు:- నా బాగు కోసం నా చెల్లెలు బలిపశువవ్వడం నే నే మాత్రం సహించనమ్మా!

శాంత:- నువ్వు చెప్పేది బాగానేవుందిరా. కాని, నేను అమ్మాయిని కూడా అడిగి చూశానుగా! దానిష్ట మయ్యే అది యీ పెళ్ళి చేసుకోబోతోంది.

రాజు:- నా కంతా తెలుసమ్మా! కాని నీకు సాంబయ్య వయస్సు తెల్సా? ఆ సాంబయ్య గుణాలు తెల్సా! అన్నీ తెలిసే చెల్లాయి గొంతు కోస్తున్నావా?

శాంత:- ఒరేయి, నువ్వు వూరికే గోరంతలు కొండంతలు చేసి మాట్లాడకు. విమల అన్నీ ఆలోచించింది. తన బాగుకోసమే అది యీ పెళ్ళికి వప్పుకుంది. ఎవరి బాగు వాళ్ళు చూసుకోక ఏమవుతార్రా! దానికి మాత్రం సుఖించాలని వుండదూ?

రాజు:- (తల్లి మొహంలోకి చూస్తూ) ఇంత నీచంగా మాట్లా డుతూంటు, నువ్వేనా అమ్మా?

**శాంత:-** ఏమిట్రా - అదేదో గొప్ప నేరం చేసినట్లు అట్లా మాట్లాడుతావు ? దాని బాగోగుల సంగతి అది ఆలో చించకపోతే నువ్వాలోచిస్తావా ? (కళ్ళలో నీరు తిరగ్గా) మీ నాన్నగారు పోయినప్పటినుంచి మిమ్మల్ని ద్దర్నీ ఎన్ని అవస్థలుపడి యింతవాళ్ళను చేశానో ఆ భగవంతుడికి తెలుసు. ఒక్కగా నొక్కపిల్ల ! దానికి మాత్రం అచ్చటా ముచ్చటా తీరాలని వుండదూ ? (కళ్లు తుడుచుకుంటుంది)

ఏదో వళ్ళు తెలియక మాట్లాడాను. మరచిపో అమ్మా !

**రాజు:-** [కల్పన యీ సమయాన బయటనుంచి హాల్లోకి రావడం చూసి, ముందుకొచ్చి]

కల్పనా ! యిట్లారా ఒకసారి.

[కల్పన తెల్లబోయి, సంకోచిస్తూనే రాజు గది లోపలకు వస్తుంది. ఆమె జుట్టంతా రేగి వుంటుంది. కళ్ళు ఏడ్చి ఏడ్చి అలసినట్లు వాచి వుంటాయి]

అమ్మా! ఈ అమ్మాయే ప్రక్క వాటాలో వుండే అమ్మాయి. వీళ్ళ నాన్నగారు తాలూకాఫీసులో వుద్యోగం చేశారు. కాని, వున్న వుద్యోగం కాస్తా పోయింది. ఇది చాలనట్లు నిన్న లారీక్రింద పడి, గాయాలతో హాస్పటలులో పడ్డారు. ఈమె తల్లి వుంది-పాపం, ఆమెకి క్షయరోగం. ఎప్పుడూ మందులూ, మాకులూ-

[కల్పన తల ఎత్తే సాహసం లేక తల వంచుకునే ఓ మూలగా నిలబడి వుంటుంది.]

శాంత:— (విచారంతో) అయ్యో! ఇంత చిన్న వయస్సులోనే నీకు యెన్ని కష్టాలు వచ్చాయి తల్లీ!

రాజు:— అంతే కాదమ్మా! పాపం, యీ అమ్మాయి సంపాదిస్తేనే వాళ్ళందరికీ తిండి, లేకపోతే అంతా—

(కల్పన చాలన్నట్లు రాజువైపు చూసి దీనంగా తల తిప్పుతుంది. రాజు ఆగిపోతాడు. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయి.)

శాంత:— ఎందుకమ్మా! కళ్ళనీరు పెట్టుకుంటావు? కష్టాలు అందరికీ వస్తాయి, వచ్చినట్లే వెళ్ళిపోతాయి. రా, యిట్లా వచ్చి కూర్చో!

కల్పన:— (పమిటతో కళ్లు తుడుచుకుని, చెప్పలేక చెప్పలేక) రాత్రి – రాత్రి మా నాన్నగారు-

(బిగ్గరగా ఏడ్వబోయి - దుఃఖాన్ని అతి ప్రయత్నంతో అవుకుంటుంది)

రాజు:— ఆఁ! పోయారా?

శాంత:— అయ్యో, పాపం. ఎన్ని కష్టాలమ్మా!

కల్పన:— (తనని తాను సంబాళించుకుని) మా అమ్మకి అసలు వంటిమీద స్పృహే లేదు. ఏం అవస్థలు పడుతున్నారో వాళ్లు – చూసి వస్తాను. (ఆగి–రాజుతో) నిన్న మీ వద్ద నున్న డబ్బంతా మా అమ్మకే యిచ్చేశారు. మీకు నా కృతజ్ఞత యెట్లా తెల్పుకోవాలో తెలియడం లేదు.

రాజు:— (విషాదంగా) అది నా డబ్బయినా బాగుండును. అమ్మ పంపించిన డబ్బు. నీ కృతజ్ఞత ఏదో ఆవిడకే చూపు.

(సాంబయ్య యీ లోగా మెట్లు దిగి రాజు గది వద్దకు వస్తాడు)
పై సంభాషణ జరుగుతూండగా లోపలకు ప్రవేశించి)

సాంబ:- ఆకస్మికంగా వచ్చినందుకు క్షమిస్తారనుకుంటా. (కల్పనవైపు వింతగా చూసి) ఓ! ఏదో కుటుంబ సమావేశంలా వుందే! (శాంతమ్మతో) ప్రొద్దున్నే మీ దగ్గరకు వద్దామనుకున్నా గాని, ఆలస్యంగా లేవడంతో ఏ పనీ చెయ్యలేకపోయాను. అక్కడ మీకు బాగా సౌకర్యంగా వుందా?

శాంత:- ఆc. బాగానేవుంది నాయనా! రా-కూర్చో.

కల్పన:- క్షమించండి. నేను వెళ్ళివస్తాను.

(కల్పన శాంతమ్మకి నమస్కరించి తన వాటాలోనికి వెళ్ళిపో తుంది. కల్పన వెళ్తూండగా ఆమె స్పర్శ ఎక్కడ తగుల్తుందోనని కాస్త యెడంగా నిలబడి, ఆమె వెళ్ళాక సాంబయ్య ఓ నిట్టూర్పువిడిచి కూర్చుంటూ-)

సాంబ:- (శాంతమ్మతో) ఆ అమ్మాయితో మీకెంత పరి చయం వుందనుకోలేదు.

రాజు:- ఆ అమ్మాయి విషయం అట్లా వదిలేసి మీరొచ్చిన పనేదో చూసుకుంటే చాలా బాగుంటుంది.

శాంత:- (మందలింపుగా) రాజూ!

సాంబ:- చూసారా - అదేవరస!

శాంత:- వాడు కుర్రవాడు. పెద్దమనుష్యులతో మాట్లాడటం చేతకాదు. మీరు వాడి మాటలు లెక్కచెయ్యకండి. రాజూ! సాంబయ్యగారంటే వీరే!

(రాజు మొహం ముడుచుకుని 'సీలింగ్'వైపు చూస్తూ కూర్చుంటాడు)

పెద్దమనిషి మనింటికొస్తే ఏమిట్రా అట్లాకూర్చుంటావ్?

రాజు:- (చిరాకుతో) నువ్వు మాట్లాడుతున్నావుగా — మాట్లాడు.

శాంత:- అది కాదురా! మన విమలని ఆయనకిచ్చి చేస్తే బావుంటుందని నా వుద్దేశం. నువ్వేమంటావు? నాలుగు సంగతులు మాట్లాడక అట్లా కూర్చుంటే యెట్లారా?

రాజు:- ఏమోనమ్మా! నాకేం తెలియదు. నీ యిష్టం వచ్చినట్లు కానీయి.

సాంబ:- నేను చెప్పడంలేదండీ! నేనంటే అతనికి మొదటి నుంచీ యిష్టంలేదు. నిన్న అతను ప్రవర్తించిన తీరు మీతో చెప్పాక కూడా మీరే పనిమీద యిక్కడకు రావడం నాకేం బాగుండలేదు. కనీసం యిక్కడకు వచ్చేముందు మీరు నావద్దకు వచ్చివుంటే-

శాంత:- సాంబయ్యగారూ! నేను పెద్దదాన్ని, నాకీగొడవ లేం అర్థంకావు. చిన్నపిల్లలా మీరూ పట్టింపులకి పోయి విరోధాలు పెట్టుకోవడం మంచిదికాదు,

సాంబ:- అది సరేనండి! మీ అబ్బాయి నిన్న పెద్దమనుష్యుల ముందు మాట్లాడిన మాటలు నేనుగనక సహించి వూరుకున్నానుగాని, మరోరయితే-

రాజు:- ఊఁ! మరోరయితే ఏంచేస్తారు? అదికూడా సెల వియ్యండి!

సాంబ:- (శాంతమ్మతో) నే నెప్పుడో మాటల సందర్భంలో మీ విమలతో ఏదో అంటే, దానికి పెడర్థంతీసి నిన్న ఏమేమో అన్నాడు. బహుశా, మీరూ నన్ను అపార్థం చేసుకుని అతనికా సంగతి రాసివుండాలి.

శాంత:- మిమ్ము అపార్థమే చేసుకుంటే నే నీనాడు యింత దూరం ఎందుకొస్తా నాయనా ?

రాజు:- బాగా అన్నావమ్మా !

సాంబ:- అయితే తప్పంతా నాదన్నమాట !

శాంత:- (సాంబయ్యతో) అదేమోగాని మీరు పెద్దమనుషు లయ్యుండి కుర్రాడిమీద అభాండాలు వెయ్యడ మాత్రం ఏమీ బాగుండలేదు.

సాంబ:- నేనా ? నేను అభాండాలు వేసేనా ?

రాజు:- (చటాలున లేచి) ఆఁ! నువ్వే ! వాళ్ళమ్మ చేతికిమ్మ చిట్టి చేతికి నేను డబ్బిస్తే, నాడబ్బంతా కల్పన కిచ్చా నని చెప్పిందెవరు ? నువ్వు కాదూ ? మా అమ్మ నాకూ విరోధం కల్పించి, విమలని పెళ్ళి చేసుకో డమే నీ లక్ష్యమయితే చాలా గొప్ప పొరపాటు పడ్డ వన్నమాట. ముక్కూ, మొహమూ ఎరగని స్త్రీల పట్టుకొని, వాళ్ళపైన యింత బురద చల్లడమే నీ జీవి లక్ష్యమయితే——

సాంబ:- (అడ్డొచ్చి) శాంతమ్మగారూ-వింటున్నారా? వేశ్య వెనకాల వేసుకొని యింకా మాట్లాడుతూన్న మీ అబ్బాయి మాటలు వింటున్నారా ?

రాజు:- 'షటప్'! ఆ అమ్మాయి పీల్చి వదిలిన గాలిని కూడా పీల్చడానికి నీ కర్హత లేదు. ఆకలి బాధేమిటో నీ కేమి తెలుసు ?

శాంత:- (కోపంతో) రాజూ !

రాజు:- నువ్వు కాస్సేపు వూరుకో అమ్మా !

సాంబ:- మీకు చూస్తూ యిట్లాగే వ్రాసుకుంటే, యిక మీ అబ్బాయి పేరు నా ముందు స్మరించాల్సిన అవసరం కూడా వుండదు.

(ఇంతలో రవణ, జగన్నాథం బయటనుంచి హాల్లోకి వచ్చి, రాజు గదిముందు తటపటాయిస్తూ నిలబడి వుంటారు.)

శాంత:- సాంబయ్యగారూ!

సాంబ:- మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి గాని, ఆనక మీ పైన జాలికూడా పడేవాళ్ళు లేరని విచారించకండి.

రాజు:- విన్నావా అమ్మా! ఆ మాటల అర్థం యేమిటో తెలుసా? అతనికి మన విమలనిచ్చి, అతని పాదాల్నే ఆశ్రయించుకుని పడుండకపోతే ఆనక మన మీద జాలి పడేవాళ్ళుకూడా వుండరుట. మనం పేదవాళ్ళమనేగా వీడి పొగరుబోతు మాటలు?

సాంబ:- (చల్లబడి) నే నా మాట అన్నానా? విన్నారా?

శాంత:- నేనన్నీ విన్నా నాయనా! నే మిక్కడ నానా అగచాట్లు పడితే నువ్వు మమ్మల్ని కాపాడాలని చూస్తున్నట్లున్నావు. ఆ విధంగా నీకు మేము ఋణపడితే చాలా బాగుంటుందనే నీ కోరిక కూడాను. ఇప్పుడు నాకు అర్థం అవుతోంది. నన్నింత దూరం ఎందుకు రప్పించావో! నాకు రాజంత కొడుకు, రవణంత బంధువు వుండగా ఆ దుర్గతి ఎన్నడూ పట్టదు.

సాంబ:- రవణా? ఓ! ఈ క్రొత్తస్నేహితుడు దొరికేక నా అవసరం తీరిపోయిందన్నమాట!

(రవణ లోపలికి ప్రవేశించి)

రవణ:- (రాజుతో) ఏమిటోయి రాజు, చూస్తూ వూరుకుంటున్నావ్ ? వీడి ముక్కు చెక్కేయమంటావా ?

శాంత:- రవణా ! ఏమిటా దుడుకుతనం ? సాంబయ్యగారూ వాళ్లు కుర్రాళ్లు ! వాళ్ళ మాటల్ని పట్టించుకోకండి. శాంతంగా మనం అన్ని విషయాలు తర్వాత మాట్లాడుకుందాం. మీరా రింకోసారి రండి !

(జగన్నాథంకూడా లోపలికొస్తాడు)

సాంబ:- (కోపంతో) ఇంత అవమానం జరిగాక నేను వెళ్ళానంటే మళ్ళీ రాను. అన్నీ యిప్పుడే తేల్చుకోవడం మంచిది.

రాజు:- అయితే నేను చెప్తున్నా - నువ్వు మళ్ళీ రాకుండా వుంటేనే బాగుంటుంది.

శాంత:- నా వుద్దేశం కూడా అదే !

సాంబ:- (నిర్ఘాంతపోయి, క్షణం తర్వాత తేరుకుని) ఆఁ ! అవున్లెండి, నా కింత శ్రమా ఖర్చు అయ్యాక —

శాంత:- ఖర్చు, ఖర్చంటున్నారు ఏమిటి మీ కయిన ఖర్చు ? స్టేషనునుంచి కట్టించిన రిక్షా చార్జి ఆ ? లేక యీ రెండు రోజులున్నించి యింటి కయిన అద్దా ?

సాంబ:- మనం అనవసరంగా చాలావరకు వెళ్తున్నాము. యిప్పుడయినా మించిపోయింది లేదు. ఆఖరుసారిగ అడుగుతున్నా.

రాజు:- అమ్మా ! ఇక మీ రెవ్వరూ ఆయనతో మాట్లాడకండి. రవణా, నువ్వు కూడాను.

రవణః- నన్ను మాట్లాడకుండా ఆపగలవు గాని, వాడిని ఏం చెయ్యాలా అనే నా ఆలోచన్ని ఆప లేవు.

సాంబః- ఛీ ! ఇటువంటివాళ్ళతో సంబంధం పెట్టుకోవడం నాదే బుద్ధితక్కువ !

(సాంబయ్య అవమానంతో దహించుకుపోతూ మెట్లపైకి వెళ్ళిపోతాడు)

శాంతః- ఎంత నీచంగా మాట్లాడాడో చూడు. ఇటువంటి వాడని ఎన్నడూ అనుకోలేదు.

రవణః- పోన్లెండి. చేతులు కాలకముందే, వాడి నిజస్వరూపం వెల్లడి అయింది. (రాజు నిర్లిప్తంగా అటూ యిటూ తిరుగుతుంటాడు) కూర్చో జగన్నాధం ! రాజూ! నీతో ఆ తాకట్టు వస్తువుల విషయం ఏదో మాట్లాడా లటోయ్ !

జగ :- అవును, ఆ వస్తువుల్ని తీసుకోడానికి నువ్వే వస్తావని ఎదురు చూసా. ఇంక రాకపోతే నేనే——

రాజుః- ఓ, క్షమించాలి. ప్రాసీజరేమిటో తెలియక వూరు కున్నా.

జగ :- ప్రాసీజరేముంది ? సిగరెట్ కేసు, ఉంగరం, వాచీ, నీవనీ; వాటి నిప్పించమనీ, పోలీసు డిపార్టుమెంటుకి అర్జీ పెట్టుకోడమే!

రాజుః- (లజ్జపడుతూ) ఆ వస్తువులు నావేనని రాస్తే సరిపో తుందన్నమాట !

జగ :- అవును. కావలిస్తే నా చేతికి రాసిచ్చెయ్యవచ్చు.

శాంతః- అదేమిట్రా రాజూ ! వాచీని, వుంగరాన్ని ఎక్క డైనా తాకట్టు పెట్టావేమిట్రా ?

రాజు:- నీకేం తెలియదు. నువ్వూరుకో! అయినా నువ్వెందు కిక్కడ-వెళ్ళిరా ?

శాంత:- (దీనంగా) అప్పుడేనా ? (బయట మెరుపు)

రాజు:- ఆఁ యిప్పుడే! ఈ క్షణంలోనే! రవణా! నువ్వు అమ్మని తీసికెళ్ళి కాస్త బసలో దిగబెట్టేసిరా!

శాంత:- ఎన్నాళ్ళకో కల్సుకోక కల్సుకున్న నిన్ను వదిలి వెళ్ళడమంటే ఎట్లాగో వుందిరా!

(బయట వురుములు మెరుపులు)

రాజు:- ఏమిటమ్మా! ఇప్పుడు నే నేమైనా చచ్చిపోబోతు న్నానా ? (దగ్గిరలో పెద్ద మెరుపు)

శాంత:- అబ్బ! ఎంత పాడుమాట విన్నాన్రా!

రాజు:- నా వంట్లో బాగుండలేదు—నా కాస్త విశ్రాంతి నివ్వమంటువున్నా.

రవణ:- ప్రస్తుతం వాడికి విశ్రాంతి చాలా అవసరమమ్మా, వాడి నట్లా వుండనివ్వండి. నడవండి, మనం పోదాం. మళ్ళీ వర్షంకూడా వచ్చేట్లుంది.

(శాంతమ్మ లేచి దుఃఖిస్తూ రెండడుగులు ముందుకువేసి)

శాంత:- నా తప్పేమైనా వుంటే మరిచిపో రాజూ!

రాజు:- (చిరాకుతో) వెళ్లమ్మా, వెళ్ళు. నీ తప్పేమీ లేదు. త్వరగా వెళ్ళు.

(రవణ కోపంతో రాజునోసారి చురచుర చూసి, దుఃఖించే శాంత మ్మతో బయటికి అనుసరిస్తూ)

రవణ:- రెండు మూడు రోజుల్లో వాడే తేరుకుంటాడు. మీరు విచారిస్తే ప్రయోజన మేమిటి ?

(ఇద్దరూ బైటికి వెళ్ళిపోతారు. జగన్నాధం రాజు ముఖం వైపే చూస్తుంటాడు. రాజు తలెత్తి జగన్నాధాన్ని చూసి తెల్లబోయి, వెంటనే కోలుకొని)

రాజు:- ఆ వస్తువుల విషయం అశ్రద్ధచేసి మీ కనవసరంగా శ్రమ కలిగించాను.

జగ:- ఆఁ! శ్రమేమిటి? నా కిక్కడికి వస్తూ పోతూండటం కొంచెం కాలక్షేపంగా కూడా వుంటుంది.

(క్షణం నిశ్శబ్దం. రాజు అటు యిటు తిరిగి]

రాజు:- 'టీ' ఏమైనా తెప్పించమంటారా?

జగ:- నో! థాంక్స్! అన్నట్లామధ్య, పత్రికలో మీవ్యాసం వకటి చదివాను చాలా 'మోడరన్'గా వుంది-సబ్జెక్టు

రాజు:- (ఆశ్చర్యంతో) వ్యాసమా? నాదా? నేనేమీ పంపించలేదే?

జగ:- "నేరం" అన్న టైటిలుతో వ్రాసిన వ్యాసం.

రాజు:- ఏ పత్రికలో?

జగ:- కోకిల అనుకుంటాను.

రాజు:- ఓ — అందులోనా? అది ఎప్పుడో పంపించినవ్యాసం (ఆగికాస్త, వుత్సాహంగా,) ఆఖరికి వేశారన్నమాట. ఇన్నాళ్లూ ఆ పత్రిక్కి పంపించిన సంగతే మరచిపోయా. అన్నట్లు, పొడి అక్షరాల్లో వున్న ఆ వ్యాసం మీద వున్న పేరు నాదని ఎట్లా కనుక్కోగల్గారో ఆశ్చర్యంగానే వుందే?

జగ:- (నవ్వి) కనుక్కోవాలనుకుంటే మాకు అసాధ్యమేముంది? (ఆగి, జ్ఞాపకం చేసుకుని) "చట్టాల్ని, నిర్మించడం, ధిక్కరించడం, హింసాకాండలు విస్త

వాలు, రేకెత్తించడం మొదలైన కార్యాలు చెయ్య డానికి, కొందరికే అర్హత వుంటుందని” కదూ మీరు సిద్ధాంతీకరించారు? బలే చిత్రంగా కన్పించాయి– ఆ భావాలు నాకెందుకో! అందుకే అనుకుంటా ఆ వ్యాసం నన్ను విపరీతంగా ఆకర్షించింది.

రాజు:– ఈ విషయంలో నన్ను కాస్త మాట్లాడనిస్తారను కుంటాను. నిత్యమూ అష్టకష్టాలుపడుతూ, చెమటో డ్చనిదేగాని పొట్ట గడవని, జనసామాన్యమంతా సిస లైన మనుష్యులు కారు. వాళ్ళ పనల్లా ఏనాటికో ఓ నాటికి స్వతంత్ర భావాలు కల్గిన పరిపూర్ణ మానవుణ్ణి సృష్టించడం! చరిత్ర తిరగేసి చూడండి. ఆ మానవు లకి తమ లక్ష్యమే ముఖ్యం. రక్తపాతానికి వెనుకా డరు. చట్టాలకి భయపడరు. న్యాయసూత్రాలకి కట్టు బడరు. అనాదినుంచి నెపోలియన్ వరకు అట్లాంటివారు కన్పిస్తోంటారు. వాళ్ళ భావాల ప్రచారం నిమిత్తం ఎన్నో వేల మానవజీవితాలు మట్టిలో కల్సిపోవాల్సి వచ్చినా వాళ్ళు వెనుకంజ వెయ్యరు. ఆత్మనిగ్రహం కల్గిన ప్రతిభావంతులంతా అదే వరస. వాళ్ళే ప్రపం చాన్ని ముందుకు తీసుకుపోయే పరిపూర్ణ మానవులు.

జగ:– మీ సిద్ధాంతం చాలా బాగుంది. కాని వీళ్ళని గుర్తు పట్టడం ఎట్లా? వీళ్లు ఏదోరకం బేడ్జో, యూనిఫారమో వేసుకుంటే బాగుంటుందేమో? (చటాలున) ఆ వ్యాసం రాస్తున్నప్పుడు అటువంటి వ్యక్తి మీరేనని మీకనిపించలేదు కదా?

రాజు:- (ఒక్క-క్షణం అతనివైపే నిదానంగా చూసి) అన్పించి నంత మాత్రానే అయిపోతామా ? అయినా ఏమో; అన్పిస్తే అనిపించి వుండొచ్చు.

జగ :- అయితే మీా కెప్పుడూ సమాజ శ్రేయస్సు కోసం ఏ ఘనకార్యమూ చెయ్యాలనే సంకల్పం కల్గలేదా ?

రాజు:- (నవ్వి) కల్గినా అట్లాంటివన్నీ మీాతో చెబుతానని ఎట్లా అనుకున్నారు-సార్ !

జగ :- (నవ్వేసి) బాగా అన్నారు. క్రిందటివారం ఖాన్‌ని వాడి బ్రోకర్ని చంపింది యీా రకం వ్యక్తేమోనని ఎందుకో నా కన్పించింది.

రాజు:- (గట్టిగా నవ్వేసి) అబ్బ ! ఏం నవ్వించేస్తున్నారు ! (లేచి అటు యిటు తిరుగుతూ) నిజంగా అటువంటి అసాధారణవ్యక్తే వుంటే, వచ్చొచ్చి యీా చవట కాబూలీని, వాడి బ్రోకర్ని చంపుతా డనుకుంటు న్నారా ? 'నో !' ఆ వ్యక్తి వేలకొలది స్త్రీలని, పసిపాపల్ని, వృద్ధుల్ని ఒక్క- దెబ్బకు ఆహుతి చేస్తాడు. క్షణంలో వందలకొలది గ్రామాల్ని అగ్నిజ్వాలలకి అర్పణచేసి, ఏ సంకోచమూ లేకుండా అదృశ్యమయిపోతాడు. (ఆగి) ఖాన్ని చంపిన వ్యక్తి ఎవరైనా, వాడా చనిపోయిన ఖాన్‌కంటె కూడా చవటయి వుండాలి ! లేకపోతే ఏ మూాలో నక్కి- యీా క్షణానో మరుక్షణానో పోలీసులు వచ్చి పట్టు కుంటారని గజగజ వణకిపోతూంటాడా ఆ అసమర్థుడు. ఆ అసమర్థుడు, తానే ఆ అసాధారణ వ్యక్తనుకుం

టూంటే, ఆ వైరాణ్ణి చూసి మనం జాలిపడాలి—అంతే !

[నిశ్శబ్దము)

జగ :— 'వెల్ !' మరింక మీ 'టైం వేస్టు' చెయ్యను. మీరు సాధ్యమైనంత త్వరలో వచ్చి 'స్టేట్‌మెంట్' రాసిచ్చి ఆ వస్తువుల్ని తీసుకుపోవచ్చును. 'గుడ్‌బై.'

[రాజును చిరునవ్వుతో చూసి, తలుపు వద్దకు వెడుతూంటాడు జగన్నాథం]

రాజు:— (జగన్నాథం వెనకే రెండడుగులు వేసి) నన్ను 'ఫార్మల్'గ అయినా పరీక్షించరా ?

జగ :— (ఆగి వెనక్కి చూసి) మిమ్మల్నా ? అబ్బే ? (వెళ్ళిపోతూ చటాలున ఆగి) క్రింకటివారం మీరు కాబూలీవాడింటికి ఏ సమయంలో వెళ్ళారు?

రాజు:— ఏడు–ఎనిమిది గంటల మధ్యనుకుంటా.

జగ :— మీరు మేడమీదికి వెళ్ళేప్పుడు క్రిందున్న ఖాళీ గది దగ్గర పనిమనిషొకడు వెల్ల వేస్తూండటం గమనించారా?

రాజు:— పని మనిషా ? లేదే ! నా కెవ్వరూ కన్పించలేదే !

జగ :— ఓ ! 'సారీ !' మీరు రక్కడికి వెళ్ళింది మంగళవారం అన్నారుకదూ! నే నింకా బుధవారం అనుకుంటున్నా. మా వుద్యోగాలు యిట్లాగే వుంటాయి. (నవ్వేసి) 'గుడ్‌బై'

(జగన్నాథం బైటికి వెళ్ళిపోతాడు. రాజు స్తబ్ధుగా నిలిబడిపోతాడు.

కాలవ్యవధిని సూచిస్తూ లైట్లు ఆరి, వెలుగుతాయి)

[మళ్ళీ లైట్లు వెలిగేసరికి కల్పన హాలులో కూర్చుని, లోలోపల భాగవతం చదువుకుంటూ వుంటుంది. శూన్యంలోకి చూస్తూ నిలబడివున్న రాజు నెమ్మదిగా హాల్లోకి వచ్చి తొంగిచూసి, గుడ్డి వెల్తురులో శ్రద్ధగా భాగవతాన్ని చదువుతున్న కల్పనను చూస్తాడు.]

రాజు:– (మృదువుగా) కల్పనా ! నువ్వేనా ?

కల్పన:– (తలెత్తి) ఆఁ నేనే !

రాజు:– నీతో కొంచెం మాట్లాడాలి–యిట్లా వస్తావా ?

[కల్పన పుస్తకాన్ని మూసేసి, చేత్తో పట్టుకునే రాజు గది గుమ్మం వద్దకి వచ్చి నిలబడుతుంది. రాజు తన గదిలోకి నడుస్తాడు. కల్పన అతన్ని అనుసరిస్తుంది గాని, నిలబడే వుంటుంది.]

రాజు:– కూర్చో !

(కల్పన 'అనీజీ'గా కుర్చీమీద కూర్చుంటుంది.)

ఎంతగా చిక్కిపోయావో చూడు.

కల్పన:– లేదండీ–నేను పూర్వంకూడా యింతే !

రాజు:– మీ అమ్మా వాళ్ళతో వుంటూన్నప్పుడూ యింతే నంటావా ?

కల్పన:– అవును. (తల వంచుకునే) ఇవ్వేళ మా నాన్నగారు కన్పించారు.

రాజు:– (ఆశ్చర్యంతో) ఎవరూ ? చనిపోయిన మీ నాన్నా ! ఎక్కడ ?

కల్పన:– బజారులో ! ఆ మాత్రం దూరంలో ! నిజంగా ఆయనే అనుమానంలేదు.

రాజు:– (ఆగి నిట్టూర్చి) కల్పనా ! ఒక్క సంగతి చెప్పు. మీ అమ్మ నిన్నూ, మీ నాన్నని హింసించేది కదూ ?

కల్పన:– వుహుఁ !

రాజు:- నువ్వు అబద్ధమాడుతున్నావు కల్పనా ? మీ నాన్న గారు నాకోసారి అన్ని సంగతులూ చెప్పారు.

కల్పన:- (ముఖం పాలిపోగా) తిట్టినా కొట్టినా, ఆవిడ మనస్సు మాత్రం వెన్నలాంటిది. వెంటనే విచారించేది. అయినా ఎన్నాళ్ళు దారిద్ర్యంలో ఒక్కర్తే ఈదగలదు? ఒకొక్కప్పుడు ఒక్కర్తే కూర్చుని పసిపిల్లలా వెక్కి వెక్కి ఏడుస్తుంది. ఎప్పటికో ఓనాటికి మాకందరికీ మంచిరోజులు వస్తాయని ఆవిడకు పెద్ద నమ్మకం.

రాజు:- కల్పనా ! చివరికి నీ గతేంకాను ?

(ఏమిటన్నట్లు ప్రశ్నార్థకంగా చూస్తుంది కల్పన)

అవును. వాళ్ళు యిదివరకూ నీమీదే ఆధారపడి వున్నారు. ఇప్పుడూ అంతే ! ఇకముందు సంగతే మిటని ?

కల్పన:- ఏమో !

రాజు:- సవతి తల్లినీ, ఆవిడ పిల్లల్నీ ముందుగూడా నువ్వే పోషించాలి అంతేనా ?

కల్పన:- (దైన్యంగా) పోషణా ! అంతమాట అనకండి. ఉన్నదేదో మేమంతా సమానంగా తింటున్నాం ! ఆవిడేదో బాధలు పడింది. త్యాగాలు చేసింది. ఆఖరికీ నాటికి అసహాయురాలయి పోయింది. అయినా యిప్పటికీ ఆవిడ ఆశలు చల్లారలేదు. తనకి జబ్బు నయమవ్వగానే, మా వూరు వెళ్ళిపోయి బడి పెడతా నంటూంది. బాగా బ్రతికినవాళ్ళ బిడ్డ అవటంవల్ల ఎప్పుడూ "అవి కొనాలి, ఇవి కొనాలి" అని వుబ

లాట పడ్తూంటుంది. పాపం ! అదొక్కటే ఆవిడ బల హీనత !

రాజు:- పాపం ! ఆఖరికి ఆవిడ ఆశలు, బలహీనతలూ కూడా ఆఖరయిపోయే రోజులు వచ్చాయి.

కల్పన:- (భయంతో) ఒద్దు-అట్లా అనొద్దు.

రాజు:- నీకు తెలియదు కల్పనా ! ఈ పరిస్థితులలో ఆవిడ బాధలు పడటంకంటే 'హరీ' మంటనే మంచిది.

కల్పన:- మీకు నమస్కరిస్తా-ఆ మాట అనకండి.

రాజు:- సరే ! ఆవిడ వెయ్యేళ్లు బ్రతుకుతుందని ఆశిద్దాం. కాని నువ్వేమయిపోతావు ? వాళ్ళకోసం హాస్పటలు పాలవుతావా ?

కల్పన:- ఉహూఁ. అట్లా ఎన్నటికీ జరగదు.

(కల్పన ముఖంలో భయం కన్పిస్తూంది)

రాజు:- ఏం జరగదు ? నువ్వు జబ్బు పడటమే జరగదా ? హాస్పటలుకు వెళ్ళటం జరగదా ? ఏం జరగదు ? నీకు జబ్బుచేస్తే నీ సవతితల్లి ఆ పిల్లలూ రోడ్లమీన పడి ముష్టెత్తుకోవాలి తెలుసా ?

కల్పన:- (రుద్ధస్వరంతో) ఉహూఁ ! దైవమెప్పుడూ అట్లా జరగనీడు.

రాజు:- (గదిలో నడయాడుతూ) డబ్బేమైనా కూడ పెట్ట గలేవా ?

కల్పన:- ఉహూఁ !

రాజు:- అసలు ప్రయత్నించావా అని ?

కల్పన:- చేతకాలేదు.

రాజు:- ఊఁ ! సంపాదన రోజూ వుంటదా ?

కల్పన:- (సిగ్గుతో చచ్చిపోయి, విప్పించీ వినిపించకుండా) వుహూఁ !

రాజు:- ఊఁ ! మరి చిట్టే మవుతుంది ? దాన్నిగూడా నీలాగే తయారుచేస్తావనుకుంటాను.

కల్పన (భయంతో) కాదు. ఎన్నటికి నా రాత దానికి పట్టదు. దేవుడాపని మళ్ళీ జరగనీయడు.

రాజు:- దేవుడు ! దేవుడు చాలా వాటిని జరుగనిస్తున్నాడు కల్పనా ?

కల్పన:- ఉహూఁ ! దేవుడు దాన్ని తప్పక రక్షిస్తాడు.

రాజు:- దేవుడున్నాడని నమ్మకం ఏమిటి కల్పనా ?

(కల్పన మొహం కరుడు కడుతుంది. రాజుని నిందాపూర్వకంగా చూస్తుంది. ఏదో మాట్లాడబోతుంది. గాని మాటలు పెగలవు. పెదవులు మాత్రం కంపిస్తాయి. అకస్మికంగా కన్నీళ్ళు కారతాయి. చేతుల్లో మొహాన్ని దాచుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగుతుంది. రాజు చలించ నట్లు, అటు యిటు పచార్లు చేయసాగుతాడు. కల్పన తనని తాను సంబాళించుకుంటుంది. రాజు అకస్మికంగా కల్పన ముందాగి ఆమె భుజాలపై చేతులుంచి, కళ్ళల్లోకి చూసి, వేదనని గమనించి, చటా లున ఆమె ముందు మోకరిల్లి ఆమె పాదాలను తాకి కళ్ళకు అద్దు కుంటాడు. సరిగ్గా యీ సమయాన రాజు మొహం పిచ్చివాని మొహం లాగ అయిపోతుంది. కల్పన చిన్న కేకతో తన పాదాల్ని వెనక్కి లాక్కుంటుంది.)

కల్పన:- ఎంతపని చేశారు ? మీరు నాకా నమస్కరించడం?

రాజు :- (అప్పటికి లేచి నిలబడి) నీకు కాదు. బాధా సర దష్టులైన సంక్షుభిత మానవాళికంతకూ !

(కిటికీవద్దకు వెళ్ళి, ఒక్కక్షణం బయటకు చూసి, వెంటనే కల్పన వైపు తిరిగి)

దృష్టిలో ఏ స్వార్థమూ లేకుండా త్యాగం చేశావు. ఎవ్వరికీ ప్రయోజనంవుండదని ఎరిగే ఈ త్యాగం చెయ్యడం మామూలు విషయంకాదు. కాని ఒక్కటి అడుగుతాను చెప్పు. అన్నీ తెలిసికూడా నువ్వీ సిగ్గుమాలిన పనికి ఎట్లా పాల్పడ్డావు? ఇంతకంటే ఎందులోనైనా మునిగి యీ జీవితాన్ని అంతం చేసుకోడం నయంకదూ?

కల్పన:- (సిగ్గుతో క్రుంగిపోతూ) కాని నా తల్లీ పిల్లల గతో?

రాజు:- రొంపిలో దిగి దైవాన్ని ప్రార్థిస్తే, ఆ దైవం నిన్నూ. నీ తల్లినీ పిల్లల్నూ కాపాడతాడని నీ నమ్మకం. ఆ నమ్మకమే నిన్ను ఆత్మహత్య చేసుకోనీకుండా అడ్డుపడింది. అంతేనా?

కల్పః- (అరక్షణం మౌనం) ఆ దైవమే లేకపోతే నేనేమయిపోయేదాన్ని? ఎక్కడుండేదాన్ని?

రాజు:- ఓ! ఆ దైవం నీకు చేసిన వుపకారమేమిటో కాస్త చెబుదూ!

కల్ప:- [కోపంతో] చాలు! ఇంక నన్నేమీ అడగకండి.

రాజు:- ఏం?

కల్ప:- ఆ ప్రశ్న అడిగే హక్కు మీకెక్కడిది? ఆ దేవుడే నాకు దిక్కు. ఏం చేసినా ఆయనే చెయ్యాలి.

రాజు:- (నెమ్మదిగా) ఏమిటో అనుకున్నా - నువ్వు వట్టి వెర్రిదానివి. నిజం కల్పనా! నీకూ వెర్రి వుంది. (ఆగి)

ఏమిటా పుస్తకం? (తీసుకొని చూసి) భాగవతం. అంతేననుకున్నా లే-ఎక్కడిది?

కల్పః- ఒకళ్ళిచ్చారు.

రాజుః- రహస్యమా?

కల్పః- రహస్యమేమీ కాదు. తన చెల్లెల్లా చూసుకునే వాడు నన్ను - ఆ వీరభద్రయ్య యిచ్చాడు.

రాజుః- వీరభద్రయ్యా! ఓ...కాబూలీవాడి బ్రోకరా? ఈ గుస్తులున్న చోటేనా యిందాక నువ్వు చదువుతూంట.

కల్పః- అవును. అదే!

రాజుః- (చదువుతూ) శిరికించెప్పడు, శంఖుచక్రయుగమున్... ఓ - గజేంద్ర మోక్షంలా వుందే! (పుస్తకం ఆమె కిచ్చేసి) చదువు!

కల్పః- (ఆశ్చర్యంతో, నమ్మలేనట్లు రాజు వైపుచూసి) వీరభద్రయ్య కూడా తీరికైనప్పుడల్లా యిట్లాగేచదివించుకునే వాడు. పాపం! ఎవరో ఆ అమాయకుణ్ణి చంపేశారు.

రాజుః- కానీ - చదువు.

కల్పః- మీకు నమ్మకంలేని విషయాలు——

రాజుః- (గట్టిగా) చదవమన్నాను. చదువు!

కల్పః- (చాలా ప్రయత్నం మీద పుస్తకంపైన దృష్టి కేంద్రీకరించి చదువుతుంది. మొదట్లో స్వరం హీనంగావున్నా క్రమంగా స్పష్టమవుతుంది.) "దేహబలము నంతయు నుపయోగించి చాలాకాలము పోరాడి, యంతకంతకు తన బలము క్షీణిస్తుండగా, మకరి బలము వృద్ధిచెందు

చుండ, యింక ఎంతో కాలము పోరాడలేనని నిరాశ చెంది గజరాజిట్లు విచారించె. "ఇక నే యుపాయముతో నీ మొసలిని గెల్తు. సహాయపడు దేవతల నెవరిని తలంతును ? ఎవరిని పిలుతును ? ఈ మొసలి నుండి నన్నెవరు తప్పింపగలరు ? సకల శక్తియుతులైన పుణ్యాత్ములెవరు యుండరా ? ఉన్నచో వారికి మ్రొక్కుచున్నాను," అని పరి పరివిధాల దైవాన్ని స్తుతించి, మరియు – (కల్పన తలఎత్తి రాజు వైపు చూస్తుంది)

రాజు:– ఊఁ ! చదువు. ఆ గజరాజు ఎట్లా రక్షించబడ్డాడో విన్పించు !

కల్పన:– (చదువుతూ)

కలడందురు దీనులఎడ
కలడందురు పరమయోగి గణములపాలన్
గలడందు రన్నిదిశలను
గలడు కలండనెడి వాడు గలడోలేడో !

అనిపలికి తనమనంబున నగ్గజేంద్రుండీశ్వర సన్నిధానంబు గల్పించు కొని యిట్లనియె.

(ఈ క్రింది పద్యము చదువుతూ, తనే ఆ స్థితిలో వున్నట్లు వడలు పులకరించగా, కల్పన కన్నీరు కారుస్తుంది.)

లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె
బ్రాణంబులున్, ఠావుల్దప్పెను, మూర్ఛవచ్చె
దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్, నీవేతప్ప
నితఃపరం బెరుగ, మన్నింపందగున్ దీనునిన్
రావే ఈశ్వరా ! కావవే వరద, సంరక్షింపు భద్రాత్మకా !

(కన్నీటితో శూన్యంలోకి చూస్తూ వుండిపోతుంది.)

రాజు:- హూఁ! తర్వాత.

కల్పన:- (నెమ్మదిగా పుస్తకంవైపు దృష్టి మరలించి) అనిపలికి మరియు నరక్షిత రక్షకుడైన ఈశ్వరుండా పన్నుంగైన నన్నుంగాచుగాక యని నింగి నిక్కి చూచుచు, నిట్టూర్పులు నిగుడించుచు, బయలాలకించుచు నగ్గజేంద్రుండు మొర సేయుచున్న సమయంబున, లోకవ్యాప్తి లేని బ్రహ్మాదులు మొరవిని యూరకుండ వైకుంఠ పురంబులో నున్న సర్వశక్తియుతుడగు వెన్నుడు గజరాజు మొరవిన రాగానే-

సిరికింజెప్పడు శంఖుచక్రయుగముంజేదోయి
సంధింపడే పరివారంబును జీరడభ్రగపతిం
బన్నింపడాకర్ణి కాంతర ధమ్మిల్లము జక్కనొత్తడు
వివాదప్రోద్ధిత శ్రీ కుచోపరి చేలాంచలమైన
వీడడు గజప్రాణావనోత్సాహియై.

దయానిధియైన నారాయణుండు యీవిధముగా బయలుదేరి కరికులేంద్ర విజ్ఞాపిత, నానావిధ దీనాలాపంబులాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం దనివిసాలించి సంభ్రమించి, దిశలు నిరీక్షించి, గజేంద్ర రక్షాపరత్వంబు సంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి, మనస్సమాన సంచారుడైపోయి, నప్పంకజాకరంబు బొడగని సకల లోకములలో నడ్డులేక తిరుగు తన చక్రమును మొసలిని జంప నియోగించె. (పుస్తకాన్ని మూసేస్తూ) ఇదే గజేంద్రమోక్షము.

(కాసేపు నిశ్శబ్దము - కల్పన తలెత్తి రాజుని చూడడానికి సంకోచిస్తుంది. పుస్తకం మూసేసి అట్లాగే వుండిపోతుంది. ఆకస్మికంగా రాజు కల్పనవైపుకు వస్తూ కొంచెంగట్టిగా)

రాజు:- ఇవ్వాళ నీతో ఓ విషయం చెబుదామని పిల్చాను.

(కల్పన తన మొహాన్ని పైకెత్తి రాజు మొహంలోకి చూస్తుంది. రాజు మొహంలో ఏదో నిశ్చయం స్పష్టంగా మెరుస్తుంది. కఠినత్వం కూడా పులుముకుంటుంది.)

ఇవ్వాళనే మా అమ్మా వాళ్ళతో నా బంధాల్ని తెంచేసుకున్నాను. రవణని, అమ్మని నన్నిక కల్సుకోవద్దని చెప్పేశాను.

కల్పన:- [నిశ్చేష్టురాలిలా చూస్తూ] ఎందుకు అంత పని చేశారు? [ఆమె నెందుకో విచిత్రమైన భయం ఆవహిస్తుంది.]

రాజు:- ప్రస్తుతానికి నాకున్నదల్లా నువ్వే! మనిద్దరము శాప దగ్ధులం. ఒకళ్ళ నొకరు అర్థం చేసుకున్నాం. మనకి తేడా లేదు. మనిద్దరం కలిసి వెళ్ళిపోవాలి.

కల్పన:- (ఎడంగా జరిగి) వెళ్ళడమా? ఎక్కడికి?

రాజు:- ఎక్కడికో నేనెలా చెప్పగలను? నాకు తెల్సిందల్లా నీ మార్గమూ నా మార్గమూ ఒకటేనని మాత్రమే. మనిద్దరం పతితులం, బాధితులం! నువ్వెంత మాట్లాడినా ఏం మాట్లాడినా యీ ప్రపంచంలో నేను తప్ప మరెవ్వరూ నిన్నర్థం చేసుకోలేరు, కల్పనా!

కల్పన:- నాకేమీ అర్థం కావడంలేదు.

రాజు:- అంతా తర్వాత అర్థమవుతుంది. ఇంకా ఒంటరిగా వుంటే, నువ్వు నాలాగే వెర్రి మొర్రి ఆలోచన్లు చేస్తావు. అందుకనే నాతో రమ్మంటున్నా. మనిద్దరం ఒకే త్రోవన పోవాలి. మనిద్దరికీ ఒకటే తేడా! నీ జీవితాన్ని నువ్వు నాశనం చేసుకునే ఆత్మబలం,

సాహసం నీకున్నాయి. నాకు లేవు. అదే తేడా! రా. పోదాం.

కల్పన:- (రాజు కళ్ళల్లోని వెర్రితనాన్ని చూసి, నెమ్మది నెమ్మదిగా కిటికీవరకు జరుగుతూ) ఓ. మీరు బాధతో ఎంతగా కుమిలి పోతున్నారు! మీ మనస్సెంతగా వికలమయి పోయింది?

రాజు:- ఇక్కడుంటే యింకా వికలమయి, వెయ్యి శకలాలై పోతుంది. పసిపిల్లలా దుఃఖిస్తూ, దేవుని పైన భారం వేసుకుని కూర్చుంటే ప్రయోజనం లేదు. విషయాలను స్పష్టంగా చూడకల్గాలి కల్పనా! రేపు నువ్వు హాస్పటలులోనో, జైల్లోనో పడితే నీ తల్లీ పిల్లలూ ఏమవుతారు? మీ చిన్ని నాశనం కాక ఏమవుతుంది? నీ తల్లి మాత్రం చచ్చిపోక అట్లాగే జబ్బుతో ఎన్నాళ్ళు వుంటుంది?

కల్పన:- (బాధతో దుఃఖిస్తూ, చేతులు నులుముకుంటుంది) ఓ...నా గతేంకాను, నన్నేంచెయ్యమంటావు?

రాజు:- ఏం చెయ్యాలా? బంధాల్ని తెంచేసుకోవాలి. 'నా వాళ్ళు' అంటూ కూర్చుంటే లాభంలేదు. బంధాలన్నీ పూర్తిగా తెంచేసుకోవాలి. అప్పుడే స్వాతంత్ర్యమూ, బలమూను. ఈ కుళ్ళులోంచి దుర్గంధములోంచి; పాకే పురుగుల్లోంచి, కరిచే పాముల్లోంచి, నవ్వే రాక్షసుల్లోంచి, వున్నతంగా యెగిరి దూరంగా వెళ్ళిపోయే శక్తి మనం మన ఆత్మబలంతో సంపాదించాలి. పసపిల్లలా అట్లా వణికిపోతావేం?

ఏడుస్తావేం ? నన్నేగనుక అర్థం చేసుకోగల్గితే ఆ కన్నీళ్ళు, దీనాలాపాలు, దైవంముందు మోకరింపులు అవసరం వుండవు కల్పనా ? (నెమ్మదిగా) బహుశా నీతో మాట్లాడటం నాకిదే ఆఖరుసారి అవచ్చు. రేపు నేను రాకపోతే సంగతులన్నీ నీకే తెలుస్తాయి. నా మాటలన్నీ నీకిప్పుడు అర్థం కాకపోయినా, తర్వాతైనా అర్థమవుతాయి.

కల్పనః- ఓ...నన్ను వెళ్ళనివ్వండి.

[పిట్టలాగ తలుపువద్దకి పోతుంది కల్పన]

రాజుః- (కర్కశంగా) కల్పనా ! ఆగు ! (కల్పన గుమ్మంవద్ద నిలబడిపోయి వెనక్కి చూస్తుంది. బలహీనంగా) రేపు నే నిక్కడ వుండటమే జరిగితే నీ కన్నీ చెబుతా ! వీరభద్రాన్ని ఎవరు చంపారోకూడా చెబుతాను.

[వెర్రివాడిలా రాజు కల్పనవైపు చూస్తుంటాడు. కల్పన తల తిరుగుతుంది. ఆలోచన్లు భరించలేకపోతుంది రాజు మొహం చూస్తుంటే భయం వేస్తుంది. ఆమె చరచరా బయటికి వెళ్ళిపోతుంది. రాజు ఆమె వెళ్ళిన దిక్కే బాధతో చూస్తుండగా]

(కర్టెన్)

# నాలుగవ రంగము

రెండు రోజుల తర్వాత—అదే స్థలం

సమయం: మధ్యాహ్నం

(తెర లేచేసరికి రాజు తల దువ్వుకుంటూ వుంటాడు. మార్పల్లా రాజు క్రొత్తదుస్తులేసుకొని శుభ్రంగావుంటాడు. బయట బూట్లచప్పుడు విని, హాల్లోకి తొంగిచూస్తాడు. సర్కిల్ జగన్నాధం పోలీసు దుస్తులతో ప్రవేశించి అటుయిటు వింతగాచూస్తుంటాడు. జగన్నాధాన్ని చూసిన రాజు కాస్త ఖంగారుపడి, వెంటనే నిగ్రహించుకొని, కష్టంమీదే నిలబడ గల్గివుంటాడు.)

జగ :- (చేతిని ముందుకుచాచి కరచాలనంచేసి) హల్లో! గుడ్ మార్నింగ్! నిన్న నా కోసం రెండుసార్లు తిరిగావని తెలిసి నేనే నీ కోసం వచ్చా. (హాలువైపు చూపుతూ) ఇవ్వాళ సత్రం అంతా చాలా ప్రశాంతంగా వుందే! (ఆకస్మికంగా) నువ్వేదైనా చెప్పదల్చుకుంటే నిరభ్యంతరంగా చెప్పవచ్చు.

రాజు:- ఆఁ-ఏముంది? మొన్నటి మీ మాటల్నిబట్టి నన్ను కూడా 'ఫార్మల్'గానే అనుకోండి- పరీక్షించ దల్చుకున్నారనిపించింది. అంచేత నేను నిన్న—

జగ :- 'ఐ యామ్ రీయలీ సారి!' ఏదో గొడవలో పడి మొన్న, నిన్న, అసలు స్టేషన్వైపుకే రాలేకపోయా. అన్నట్లు యిక్కడకంటే మా ఆఫీసులో అయితే ప్రశాంతంగా వుంటుందేమో?

రాజు:- మీ యిష్టం!

జగ :- ఇది వృస్నంత అసహ్యాంగా గవర్నమెంటు బిల్డింగులు లుండేవు కూడదు. గవర్నమెంటు సాధారణంగా అట్లాంటి అవకాశం యివ్వదు కూడాను.

రాజు:- అవును అట్లాంటి అవకాశం యివ్వదు.

జగ :- (ఏదో ఆలోచిస్తూ) అవును. గవర్నమెంటు అటు వంటి వాటికి అవకాశం యివ్వదు. (ఒకరి నొకరు చూసుకుంటూ కొన్ని క్షణాలుండిపోతారు).

రాజు:- (కోపాన్ని అణచుకుంటూ) కాస్సేపు వూసుపోని కబుర్లు చెప్పి, అకస్మాత్తుగా అనుమానితుడ్ని గుండెల్లో పొడవడం పోలీసు టెక్నిక్ అనుకుంటా!

జగ :- గుండెల్లో పొడవడమా ? దేనితో ?

రాజు:- నా మాటలు సందిగ్ధంగా లేవే ! నే నడిగింది మీ పోలీసు టెక్నిక్ ని గురించి.

జగ :- (నవ్వేసి) ఓ ! అంతేకదా ! నిజంగా ఏ చాకుతోటో బాకుతోటో పొడవడం ఏమోనని హడలిపోయాను. ఇంతకీ నేను మాటవరుస కేదో అంటే నువ్వు... (రాజు కళ్ళల్లోకి చూసి నవ్వేస్తూ) ఏమేమో అనుమానించావు.

[రాజు నవ్వడానికి ప్రయత్నించి కృతకృత్యుడు కాలేకపోతాడు. అది చూసి జగన్నాథం మరీ విరగబడి నవ్వుతాడు. రాజు కొంచెం చికాకు పడి)

రాజు:- చూడండి ఇనస్పెక్టర్ గారు ! నన్నేమైనా ప్రశ్నలు వెయ్యదల్చుకుంటే త్వరగా వెయ్యండి, నేను వూరికే మీతో నా టైం వేస్ట్ చేసుకోలేను. ['బరస్ట్.

అవుతూ] నాకీ గొడవతో నరాలు తెగిపోతున్నాయి. తల పేలిపోతూంది. నన్నేమైనా అడగదల్చుకుంటే వెంటనే అడగండి. లేకపోతే నామానాన్న నన్ను పోనీండి.

జగ :- ఐయామ్‌సారీ ఇఫ్ ఐ హావ్ అఫెండెడ్ యూ! ఏమిటి నువ్వనేది? ప్రశ్నలేమిటి? నిన్నడగట మేమిటి? నేనేదో నవ్వితే, నవ్వానని నువ్వు కోపం తెచ్చుకో కూడదు. వెధవతత్వం నా తత్వమే చిత్రమైంది. వూరికే నాకు నవ్వొస్తుంది. చెప్పానుగా, నా తత్వం చిత్రమైందని. ఎంత చిత్రమంటే యిప్పుడు నేనో మనిషిని అనుమానించాననుకో, ఆ మనిషికి వ్యతిరేకంగా నా వద్ద బోలెడు సాక్ష్యముందనుకో, అయినా నేనా మనిషిని అరెస్టుచెయ్యను. "ఎందుకు చెయ్యవు". అని నువ్వు అడగొచ్చు. అక్కడే వుంది నా తత్వం. చాలా చిత్రమైన తత్వం కదూ? ఇప్పుడు నీకు నా సంగతి కొద్దిగా అర్థమయివుంటుందనుకుంటా. అనుమానితుడ్ని అరెస్టు చెయ్యనన్నాను కదూ? ఆ రహస్యం చెప్తా విను. అరెస్టు చెయ్యగానే కేసులోని మజాకాస్త మాయమయిపోతుంది. అదీకాక నేరస్థుడు జైల్లో కూర్చుని శాంతంగా ఆలోచించి, బ్రహ్మాండమైన డిఫెన్సు తయారు చేసుకుంటాడు. అంతేకాదు, జైల్లో పడగానే ఖైది తన మనస్సును రాయి చేసేసుకుంటాడు. తెలుసా? బయటవుంటే అట్లాకాదే? క్షణక్షణం అతనిజీవితం నరకయాతనే నే!

అశాంతేనే! ఆ అశాంతస్థితిలో వాడేమీ ఆలోచించ లేడు. తానేమీ చెయ్యలేడు. దీపంముందు కేవలం రెక్కల పురుగు. రెక్కలుండీ దూరంగా పోలేడు. అక్కడే దీపంముందు ఎగిరి — ఎగిరి, సమీపించి సమీపించి, ఆఖరికి – ఆఖరికి ఆదీపానికి ఆహుతయి పోతాడు.

(రాజుముఖం పాలిపోతుంది. గొంతును ఎవరో నొక్కేస్తున్నట్లు భయంతో పట్టుకుంటాడు. నోట్లో కేక నోట్లోనే ఆగిపోతుంది. పడి పోబోయి కుర్చీని పట్టుకొని అవుకొని నిలబడ గల్గుతాడు.)

జగ :- ఏమిటట్లా వున్నావ్ ? ఒంట్లో బాగుండ లేదా ? కూర్చో ?

రాజు:- [మాట్లాడేస్థితిలో లేకపోయినా] ఓ — నా కంతా అర్థమయింది. మీ నాటకమంతా అర్థమైంది. మీరిన్నాళ్ళనుంచీ నన్ననుమానిస్తున్నారన్న మాట! నన్ను అరెస్టు చెయ్యాలని వుంటే వెంటనే చెయ్యండి!

జగ :- అట్లా వూరికే వుద్రేకపడితే మళ్ళా జబ్బు చేస్తుంది. నా మాటలు ఎందుకు నమ్మవు ? నేను స్నేహితుడిగా నిన్ను చూసిపోదామని వచ్చా రాజూ! నువ్వు లేని పోని అనుమానాల్తో, నీ ఆరోగ్యం పాడుచేసు కుంటున్నావ్! అది సరేగాని, మొన్న పచ్చమేడ దగ్గర కెళ్ళేవుట-అసలే నీరసంగా వున్నవాడివి అట్లా బయట తిరగడ మెందుకు చెప్పు ?

రాజు.- ఓ ! నామీద సి. ఐ. డి. లను కూడా పెట్టారన్న మాట ?

జగ:- నువ్వు వట్టి వెర్రాడివోయ్. నిన్ననుమానిస్తే నీతో యీ సంగతులన్నీ చెప్తానా ?

రాజు:- అబద్ధాలు ! అన్నీ అబద్ధాలు ! నన్ను అరెస్టు చేసే వుద్దేశ్యం వుందా లేదా ? ఉంటే చెప్పండి. లేకపోతే నన్ను పోనీండి.

జగ :- ఈ జబ్బు స్థితిలో బయటకు వెళ్తావా ?

రాజు:- (కోపంతో) నాకు కోపం తెప్పించడానికి మీా పెద్దలు దిగిరావాలి. నన్ను వెళ్ళనిస్తారా లేదా ?

జగ :- (లేచి రాజువైపు నడుస్తూ) ఈ స్థితిలోనా ? 'నో !' వీల్లేదు.

రాజు:- ఎందుకు వీల్లేదు. నామీాద అనుమానం లేదుగా! మీారు నా స్నేహితులుగా! నన్ను నా యిష్టం వచ్చిన చోటుకు పోనీండి.

జగ :- కాని నీ ఆరోగ్యం—

రాజు:- ఆరోగ్యం, ఆరోగ్యం. నా ఆరోగ్యం సంగతి మీా అందరికీ పడితే నన్నిట్లా అనుమానిస్తారా ? నా కిట్లా వెర్రెత్తిస్తారా ? అనారోగ్యంతో వున్న నన్ను రెచ్చగొట్టి నా నోటమ్మటే అంతా చెప్పించాలని చూస్తున్నారు. పిరికిపందలు !

జగ :- నీ నోటమ్మట చెప్పించడానికి నీ దగ్గర రహస్యాలేమీా లేవుకదటోయ్ ! నీకు ప్రతివిషయాన్నీ అనుమానించటం అలవాటయిపోయింది.

రాజు:- అన్నీ అబద్ధాలు. మీాకు నిజాన్ని అంగీకరించే ధైర్యం లేదు. మీాకు సాక్ష్యమేవుంటే నన్ను అరెస్టుచెయ్యండి.

సాక్ష్యాన్ని పిలవండి. విచారించండి. ఊఁ. అరెస్టు చెయ్యండి. పోలీసు స్టేషన్‌కి తీసుకెళ్ళండి.

జగ :- (చిర్నవ్వుతో) ఊఁ. సరే! నీ కోరికకూడ తీర్చి నట్లవుతుంది. నాతో పోలీసు స్టేషన్‌కి రా!

రాజు:- (చల్లబడి, జగన్నాధం ముఖంలోకిచూస్తూ) ఎందుకు?

జగ :- నువ్వే వస్తానంటున్నావుగా!

రాజు:- (మాట్లాడడు. అనుమానంగా జగన్నాధం ముఖం పరిశీలిస్తూ వుంటాడు.)

జగ :- (నవ్వేసి) కూర్చోవోయ్, కూర్చో! (ఆగి) అన్నట్లే సంగతి విన్నావా నువ్వు?

రాజు:- (కుదుటబడి కూర్చుంటూ) ఏ సంగతి?

జగ :- వెల్లవేసే రంగయ్య సంగతి. అతనికి హత్యతో ఏమాత్రం సంబంధం లేదని తేలింది.

రాజు:- ఓ-మరయితే—

జగ:- హంతకుడు మరోడన్నమాట. పోలీసులు చంపేస్తారని అనవసరంగా అతను తను చెయ్యని నేరాన్ని ఇన్నాళ్లు నెత్తిపైన వేసుకున్నారు.

(రాజు మాట్లాడ ప్రయత్నించి విఫలుడవుతాడు. పెదాలు వణుకుతాయి. నోట్లోని సిగరెట్ జారిపోతుంది. జగన్నాధం అతన్ని గమనిస్తూనే వుంటాడు.)

మరయితే హంతకుడెవ్వరని అడుగుతున్నావు కదూ?

రాజు:- (బలహీనంగా) అవును-ఎవరు?

జగ :- (త్వరితంగా) ఎవరయితేయేంగాని, యీ మధ్య గొప్ప యింగ్లీషు పిక్చర్ చూశా. అందులోని యువకుడు ఒక్క యువతిని ప్రేమిస్తాడు. కాని ఆమె అతన్ని

ప్రేమించను. ఆ యువకుడు ఎంత చక్కటి ఎక్స్‌ప్రెషన్స్ యిచ్చాడనుకున్నావ్. ఆ పిక్చర్ పేరు—

రాజు:- (లేచి) ఏమిటీ నాటకమంతా ? అంతంలేదా యీ చిత్రహింస కింక ! మీ పోలీసు టెక్నిక్ నా కర్థమయ్యింది. నా మీదే మీ అనుమానం. చెయ్యదల్చుకుంటే నన్నరెస్టు చెయ్యండి వెంటనే. కాని ఇంకే మాత్రం నే నీ హింస సహించను. తెల్సిందా! (బల్లను దడదడ బాది) సహించను. ఏమాత్రం సహించను.

జగ :- రాజూ ! అనవసరంగా అప్‌సెట్ అవుతున్నావు !

రాజు:- (ఉద్రేకంతో) నేను సహించను.

జగ :- ఊరికే అట్లా అరవకు. రోడ్డుమీద పోయే జనమంతా లోపలకు వస్తారు.

రాజు:- (నెమ్మదిగా డెలిరియంలోలాగ) సహించను. (పెదాలు మాత్రం వణుకుతుంటాయి.)

జగ :- కూర్చో రాజూ కూర్చో ! నీకు సలహా యిద్దామని నీ స్నేహితుడిగా నే నిక్కడికి వచ్చాగాని మరో విధంగా కాదు. నీ ధోరణిలోనే నువ్వున్నావు. కాని నా మాటలు వినిపించుకోవడంలేదు. నేను చెప్పేదంతా నీ మంచికోసమే రాజూ ! ఇప్పటికైనా ఏమీ మించిపోలేదు.

(రాజు తల పేలిపోయేట్టుంటుంది. ఏమీ అర్థంకాదు. నీరసంగా "మళ్ళా యిదేమిటి ?" అన్నట్లు చూస్తాడు.)

జగ :- అవును రాజూ ! నీ అంతట నువ్వే అంతా అంగీకరిస్తే శిక్ష తగ్గుతుంది. నీ మంచికోసం చెబుతున్నా.

రాజు:- (చేసేది లేక) మీ వుద్దేశ్యం?

జగ :- (రాజువైపే నడుస్తూ, కళ్ళల్లోకి చూస్తూ) ఉద్దేశ్యమా? నువ్వే-నువ్వే హంతకుడివని రాజూ! ఆ హత్యచేసింది నువ్వే!

(రాజు కొద్దిగా వణుకుతాడు. మాట్లాడాలని ప్రయత్నించినా పెదవులు కదుల్తాయి గాని, మాటలు రావు. క్షణం తర్వాత కుర్చీని ఆనుకుని నిలబడగల్గి, చాలా చిన్న తప్పిదం చేసిన వాడిలా)

రాజు:- హత్యా?

జగ :- అదే-హత్యలు! (ఇద్దరిమధ్య చాలాసేపు నిశ్శబ్దం. రాజు తన చేతివేళ్ళను జుట్టులోనికి పోనిస్తూంటాడు. జగన్నాధం చాలా ప్రశాంతంగా వుంటాడు)

రాజు:- (తేరుకుని) సాక్ష్యం?

జగ :- కావలసినంత వుంది.

రాజు:- ఏమిటవి?

జగ :- అది నా రహస్యం.

రాజు:- అయితే అరెస్టు చెయ్యండి.

జగ :- రాజూ! నా మాట విని నేరాన్ని నీ అంతట నువ్వే వప్పుకో-శిక్ష తగ్గుతుంది.

రాజు:- (జగన్నాధం మొహంలోకి చూస్తూ) ఓ...నన్నిప్పుడు అరెస్టుచేసే వుద్దేశ్యంలో లేరన్నమాట.

జగ :- ఊహుఁ. కాని ఎప్పుడు చేసినా చెయ్యొచ్చు. ఈలోగా నా సలహా మన్నించడం మంచిది.

రాజు:- నే నీ లోగా తప్పించుకు పారిపోతే?

జగ :- నీలాంటివాళ్ళ తత్వం నాకు బాగా తెలుసు రాజూ-బాగా తెలుసు. అట్లా ఎప్పటికీ జరుగదు. 'సోలాంగ్

నీ టైం చాలా వేస్ట్ చేశా పాపం! (జగన్నాథం బయటకు వెళ్తూ గుమ్మంవద్ద ఆగి వ్యంగ్యంగా) ఇంకో మాట! ఇవ్వాళ రేపట్లో నీ క్కైనా విపరీతబుద్ధులు పుట్టొచ్చుగాని, అట్లాంటిది జరగబోయే ముందు ఆ నగలు, డబ్బు ఏ రాతికింద దాచావో పుత్తరం ముక్కలో రాయి!

(చరచరా వెళ్ళిపోతాడు జగన్నాథం, జగన్నాథం వెళ్ళిన దిక్కే శూన్యంలోకి చూస్తూ కాసేపు నిలబడిపోతాడు రాజు. ఇంతలో బయట నుండి హాల్లోకి వచ్చిన కల్పన రాజుని చూసి నిలబడుతుంది. రాజా మెను కాస్సేపటికి గమనించి)

రాజు:- (హీనస్వరంతో) కల్పనా! మాట!

కల్పన:- అమ్మనో సారి చూసి యిప్పుడే వచ్చేస్తా.

రాజు:- (దైన్యంగా) ఎప్పుడూ యిక వాళ్ళ ధ్యాసేనా? ఒక సారిటు రా కల్పనా? (కల్పన లోపలికి వస్తుంది)

కల్పన:- ఏమిటి?

రాజు:- నేనోటి అడగనా?

కల్పన:- అడగండి.

రాజు:- నామీద కక్ష తీర్చుకోలేక, నీమీద దొంగతనాన్ని మోపి, నిన్ను జైలుకు పంపి అవమానించాలని నిన్న ఆ సాంబయ్య ప్రయత్నంచేశాడా లేదా?

కల్పన:- అవును. ప్రయత్నించాడు. మీరు నన్ను కాపాడారు కూడా. కాని యిప్పుడా విషయం దేనికి?

రాజు:- నే నడ్డుపడకపోతే నిన్న నువ్వు జైలుపాలయ్యేదాని వేనా? అప్పుడు మీ అమ్మవాళ్లు ఏమయిపోయేవాళ్లు కల్పనా?

కల్పన:- ఏమో - అన్నిటికీ ఆ దైవమే దిక్కనుకుంటున్నా ?

రాజు:- అదికాదు కల్పనా ! వాడి స్వభావం నీకు ముందే తెలిస్తే, నీ కవకాశం దొరికితే వాడ్ని నాశనం చెయ్యకుండా వదుల్తావా ?

కల్పన:- ఏమో-అయినా నన్నెందుకీ ప్రశ్న ?

రాజు:- నీకు ప్రశ్న అర్థంకాలేదు. ఇప్పుడు తాచుపాముందనుకో. అది అందర్నీ కరుస్తుందని తెలుసు. చేతిలో కర్ర వుంటే దాన్ని చంపక వదుల్తామా ?

కల్పన:- సాంబయ్యగారు మనిషికదా ?

రాజు:- అంటే వాడిని బతకనిచ్చి, నువ్వు ప్రేమించే నీవాళ్ళని కష్టాలుపాలు చేస్తావన్నమాట. అంతేనా ?

కల్పన:- మరొకరి బాగోగుల్ని, చావుబతుకుల్ని, నిర్ణయించే హక్కు నా చేతుల్లో ఎట్లా వుంటుంది? నా కెవరిచ్చారీహక్కు ?

రాజు:- అటువంటి హక్కులు ఎవ్వరూ యివ్వరు కల్పనా ?

కల్పన:- ఇందాకట్నుంచి మీరేదో చెప్పాలని ప్రయత్నిస్తున్నారు. చెప్పేదేదో తిన్నగా చెప్పండి. నన్నెందుకిట్లా బాధపెడతారు. (ఆమె కళ్ళలో నీరు తిరుగుతుంది. రాజు విషాదంగా ఆమెవైపే చూస్తూ కొన్ని క్షణాలుండిపోతాడు.)

రాజు:- (చివరకి హీనస్వరంతో) అవును కల్పనా ! నువ్వు చెప్పింది నిజం. నేను చెప్పాలనుకున్నది చెప్పే సాహసం లేక మధ్య నిన్ను హింసిస్తున్నా !

(నవ్వబోయి కృతకృత్యుడు కాలేకపోతాడు. అతని ముఖాన్ని విషాద ఛాయలు ఆవరించి వుంటాయి. తల వంచుకుని రెండుచేతుల్తోనూ

ముఖాన్ని దాచుకుంటాడు. ఒకవేళ తానామెను అసహ్యించుకుంటు న్నానా అనే తలంపు రాగానే చటాలున తలెత్తి ఆమెని పరిశీలనగా చూస్తాడు. ఆమె అతనివైపే చూస్తూంటుంది- అతని మనస్సులో ఏ మూలైనా అసహ్యముంటే అదృశ్యమయిపోతుంది. తను ఎదురు చూస్తున్న సమయ మాసన్నమైందని గ్రహిస్తాడు. మళ్ళీ మొహాన్ని చేతులమధ్య దాచుకుంటాడు. అకస్మికంగా పాలిపోయిన ముఖంతో లేచి మౌనంగా కల్పనవద్దకు వెళ్ళి కూర్చుంటాడు.)

కల్పన:- ఏమిటట్లావున్నారు ? ఏమిజరిగింది ?

(రాజు సమాధానం యివ్వలేకపోతాడు. ఆమె అతనివైపే చూస్తూ సమాధానం కోసం నిరీక్షించి, రాకపోగా భయపడుతుంది. మౌనాన్ని భరించలేక పోతుంది. రాజు తన పాలిపోయిన మొహాన్ని ఆమెవైపు తిప్పుతాడు. పెదవులు వణుకుతుంటాయి. కల్పన భయంతో కొంచెం యెడంగా జరిగి]

ఏమిటండీ ?

రాజు:- ఏమీలేదు కల్పనా! నిన్ను పిల్చి యిలా ఎందుకో బాధ పెడ్తున్నానో నాకే తెలియడం లేదు.

కల్పన:- (అతని వేపే చూస్తూ వేదనతో) ఓ— మీరెంతగా బాధపడి పోతున్నారు.

రాజు:- నిన్ననో సంగతి చెబుతానన్నాను గుర్తుందా ? ఆ సంగతి చెప్పడానికే నిన్నిప్పుడు పిల్చాను.

కల్పన:- [పాలిపోయిన ముఖంతో వూపిరి కష్టంమీద పీలుస్తూ] అవును. వీరభద్రయ్యని హత్య చేసిన దెవరో చెబుతానన్నారు. కాని, ఆ సంగతి మీకెట్లా తెలుసు?

రాజు:- నాకు తెలుసు కల్పనా !

కల్పన:- [లేచి ఓఅడుగు వెనక్కి వేసి] నిజంగానేనా ? [రాజు తల వూపుతాడు.] చెప్పండి మీకెట్లా తెలుసు ?

రాజు:— గ్రహించలేవా ? (మాట్లాడలేకపోతాడు. మొహాన్ని మరో ప్రక్కకు త్రిప్పి) అతనెన్నడూ వీరభద్రాన్ని చంపాలని అనుకోలేదు కల్పనా ! దుర్మార్గుడైన ఖాన్నే చంపాలని అతని వుద్దేశము. ఖానే వంటరిగా వుంటాడనుకున్నాడు వాడు. కాని, ఆ సమయాన వీరభద్రం కూడా లోపలే వుండటం తటస్థించింది. (కాసేపు భయంకరమైన నిశ్శబ్దం. ఒకళ్ళ నొకళ్ళు చూచుకుంటారు.) నువ్వింకా గ్రహించనే లేదా ?

కల్పన:— (విన్పించీ విన్పించకుండా, సందేహంగా) వుహుఁ,

రాజు:— మళ్ళా ప్రయత్నించు కల్పనా ? (దీనంగా) అతను వీరభద్రాన్ని తప్పనిసరిగా చంపాల్సి వచ్చింది. గత్యంతరం లేక చంపాల్సి వచ్చింది. ఇప్పుడర్థమయిందా ఎవరో ?

[కల్పన మొహంలో భయం కన్పిస్తుంది. రాజుకి దూరంగా జరిగిపోతుంది. ఈ క్షణమో మరుక్షణమో ఆమెలోని దుఃఖం పొంగి, కట్టలు తెంచుకొని వచ్చేలా వుంటుంది)

కల్పన:— ఓయి దేవుడా ! నిజమేనా ?

(రాజు తల పంకిస్తాడు ఆమె లేడిలా కిటికీవద్దకు పరుగెత్తి ముఖాన్ని అవతలకు తిప్పుకొని, కొన్ని క్షణాలుపాటు అట్లాగే నిలబడుతుంది. రాజు నిశ్చలంగా ఆమె వైపే చూస్తుంటాడు. ఆమె దుఃఖాన్ని దిగ మ్రింగుకుని నెమ్మదిగా వెనక్కివచ్చి రాజు కళ్ళల్లోకి చూసి)

ఓ... మీ మనస్సు ఎంతగా క్షోభించి పోతూందో నా కర్థమవుతూంది.

(కల్పన కన్నీరు కార్చుతూండగా, తన చేతుల్లోకి రాజు చేతుల్ని తీసుకుంటుంది.)

రాజు:— (తొటబడుతూ) నన్నింకా ఆదరిస్తున్నావా ?

కల్పన:- ఇంత బాధపడుతూ యిన్నాళ్లెందుకు ప్రూరుకున్నారు?
రాజు:- ఇప్పుడైనా చెప్పానుగా కల్పనా ? (చేతులు వదిలేస్తుంది)
కల్పన:- (రాజువైపు చూస్తూ మృదువుగానే) మీరు-మీరెట్లా ఒడిగట్టారీ ఘోరానికి? ఎందుకు చేసినట్లీ అన్యాయం?
రాజు:- (తటాలున ఆమె చేతిని పట్టుకొని) కల్పనా ! నువ్వు నన్ను వదలవుకదూ ?
కల్పన:- ఊహుం ! ఎన్నటికీ వదలను.
రాజు:- ఈ విషయం నీతోనే ఎందుకు చెప్పానో యిప్పుడు తెలుస్తోంది. ఈ ఆవేదన నే నొక్కడినే భరించలేను కల్పనా ! (చేతిని వదిలేస్తాడు)
కల్పన:- మీరు చెప్పడమే మంచిదయింది. కాని ఈ ఘోరానికి ఎందుకు ఒడిగట్టారో చెప్పారుకారు. ఎందుకు ?
రాజు:- చెప్పినా నీ కర్థంకాదు కల్పనా ! ఆ ఖాన్ సంఘానికి ఓ చీడపురుగు.
కల్పన:- మీరు నిజం చెప్పడంలేదు. ఆ ఖాన్‌దీ ప్రాణమే కదా ?
రాజు:- ఓ ! (ఒక్కక్షణం ఆగి, ఆలోచించి) మా అమ్మనీ, చెల్లెల్నీ యీ పీడిత ప్రజానీకాన్నీ సుఖపెట్టడానికి కల్పనా !
కల్పన:- కాని ఓ ప్రాణిని చంపేహక్కు మీ కెవ్వరిచ్చారు ?
రాజు:- (కొంచెం ఆగి) చెప్పానుగా ! ఆ ఖాన్ సంఘానికి చీడపురుగు. నేను చేసినదల్లా ఆ చీడపురుగును నలిపి పారెయ్యడమే.

కల్పన:- ఓ! మీకెట్లా చెబితే తెలుస్తుంది. అతనికీ భార్యా బిడ్డలు, బంధువులు ఎక్కడో వున్నారని, అతనికీ మనకుండే బలహీనతలున్నాయనీ, అతనిదీ జీవితమేనని మీకెట్లా తెలుస్తుంది?

రాజు:- అదంతా నాకు తెల్సు కల్పనా! నేనెంతో ఆలోచించాను. మథనపడ్డాను. కానీ సమాజ శ్రేయస్సు కోసం ఆ క్షుద్రుణ్ణి నాశనం చెయ్యటం తప్పు కాదనుకున్నా.

కల్పన:- మీరు చేసిన పొరపాటు అక్కడే వుంది. వాడు క్షుద్రుడని నిర్ణయించడానికి మీరెవరు? మనమంతా క్షుద్రులము కామూ? మీలోనూ నాలోనూ వున్న దైవం వాడిలో లేదూ? ఎంత బాధ, ఎంత దారిద్ర్యం అనుభవించాక, అతనిట్లా తయారయ్యాడో మనకేం తెలుసు? ఒక వ్యక్తిని నాశనం చేస్తే ప్రపంచం మారిపోతుందా? సమాజాన్ని మార్చటం చేతకాక వ్యక్తులను నాశనం చేస్తారా? ఓ...ఎంత పొరపాటు చేశారు.

[నిశ్శబ్దంగా దెబ్బతిన్న లేడిలాగ రాజు మానసిక బాధ అనుభవిస్తాడు]

రాజు:- నువ్వు చెప్పింది నిజమేననిపిస్తోంది కల్పనా! ఇన్నాళ్ళూ నాలో నేను తర్కించుకుంటూ బాధపడ్తూన్నది కూడా యిదే. నువ్విప్పుడు నా అనుమానం తొలగించావు. నా మనస్సు బాధతో కృంగి కృశించిపోతోంది. నేనేం చెయ్యను కల్పనా? ఈ వేదన నుంచి బయటపడటం ఎట్లా? చెప్పు కల్పనా! నేనేం చెయ్యను?

కల్పన:- చేసిన పాపం చెబితే పోతుంది. వెంటనే పోలీసుల దగ్గరకెళ్ళి మీ నేరాన్ని అంగీకరించండి. అప్పుడే మీకు మనశ్శాంతి.

రాజు:- (ఆశ్చర్యంగా చూస్తూ) పట్టుబడి పొమ్మంటావా? అదేనా నువ్వనేది?

కల్పన:- అవును.

రాజు:- కాని నా కింకా జీవితేచ్ఛ నశించలేదు కల్పనా!

కల్పన:- మీరు జీవించాలనే నా కోరికకూడా. చేసిన పాపానికి మీరునిజంగా బాధపడి, మీనేరాన్ని అంగీకరిస్తేనే మీకు మనశ్శాంతి. మనశ్శాంతి వుంటేనే జీవితం. వెళ్ళండి,

రాజు:- (ఆలోచిస్తూ) ఊహుఁ. ఇప్పుడప్పుడేకాదు· ఇంకా ఆ టైం రాలేదు.

(ఇంతలో ఆచారి బైటనుంచి పరుగెత్తుకుంటూ వస్తాడు)

ఆచారి:- ఎవరున్నారక్కడ? రాజుగారూ! త్వరగా రావాలి. (కల్పనను జూచి) కల్పనా! మీ అమ్మగారు రోడ్డు మీద అడుక్కుంటూ, అడుక్కుంటూ వంతెన దగ్గర రక్తం కక్కుకుని పడిపోయింది. పిల్లలు వకటే ఏడుపు. పంషమ్మా!

కల్పన:- ఎవరూ? అమ్మా! ఇంట్లో లేదూ?

ఆచారి:- లేదమ్మా! ప్రొద్దున్నుంచి పిల్లలతో రోడ్లమీద అడుక్కుంటూ తిరుగుతూందమ్మా! ఎంత చెప్పినా వినలేదు. "ఎన్నాళ్ళు నా కూతురిమీద ఆధారపడతాను. నన్ను వదలండి" అని విదిలించి కొట్టింది. పహేవండమ్మా - యీా దగ్గరే.

[కల్పన దుఃఖిస్తూ ఆచారితో బైటకు వెళ్ళిపోతుంది. రాజు ఆమె వెనకాతే రెండడుగులు వేస్తాడు. ఇంతలో శాంతమ్మ ఎదురుంగా రావడం చూసి నిల్చిపోతాడు. ఇదే సమయాన సాంబయ్య చిన్న సూట్‌కేస్‌తో పైనుంచివచ్చి రాజుని ఓసారి కొరకొర చూసి, బయటికి వెళ్ళిపోతాడు.]

రాజు:- (తల్లితో), రా! అమ్మా!

శాంతమ్మ:- (సందేహిస్తూనే లోపలికొస్తూ) నువ్వు వద్దన్నా మళ్లావచ్చాను! చికాకు పడకు. ఇప్పుడే వెళ్ళిపోతాను. నిన్నల్లా నిన్ను చూడకపోతే నా మనస్సు వెర్రెత్తి నట్లయిపోయిందిరా! ఇవ్వాళ వంట్లో కులాసాగా వుందికదూ?

రాజు:- పర్వాలేదమ్మా! కూర్చో.

[శాంతమ్మ కూర్చుంటుంది. కళ్ళవెంబడి నీళ్ళు తిరుగుతాయి]

శాంత:- మీ నాన్నగారు పోయిన దగ్గరనుంచీ యిదే వరస. ఆనందంతో వున్నా, దుఃఖంతో వున్నా వెంటనే గిర్రున నీళ్ళు తిరుగుతాయి. నిన్ను మళ్ళీ కలుసు కున్నందుకు నాకెంతో సంతోషంగా వుందిరా! బాగా అలసిపోయినట్లున్నావు - ఎక్కడైనా తిరిగొ చ్చావా?

రాజు:- లేదమ్మా! బాగానేవున్నా!

శాంత:- నువ్వేదో బోలెడు పెద్ద విషయాల్ని గురించి ఆలో చిస్తూంటావు. నా గొడవల్తో నిన్నాట్టే విసిగించను. ఇందాక రవణ వచ్చి యీ పత్రిక నాకిచ్చి, కాస్సేపు కూర్చుని వెళ్ళాడు. ఇందులో నీ వ్యాసాన్ని చదివి చదివి ముక్కిసిపోతున్నా. (పత్రిక చూపుతుంది)

రాజు:- ఏదమ్మా ! ఈ పత్రికేనా ? ఏది చూడనీ !

(తల్లి యిచ్చిన పత్రిక తీసుకుని పేజీలుతిప్పి, వ్యాసాన్ని చూస్తుంటాడు)

శాంత:- నన్ను వెర్రిదాన్ననుకో, మరేమన్నా అనుకో. నువ్వు తొందర్లోనే చాలా గొప్పవాడివైపోతావురా! ఇన్నాళ్ళూ ఈ గదేమిటి ? ఆ బట్టలేమిటి ? 'ఏమిటీ వాలకం' అనుకునేదాన్ని. గాని యింకెప్పుడూ అట్లా అనుకోను. నీ కున్న తెలివితేటల్తో ఎంతో పెద్ద ఉద్యోగం దొరకవచ్చు. నీ పేరును అచ్చులో చూస్తుంటే-నా కెంత గర్వంగా వుందనుకున్నావు ! అయినా పూర్తిపేరు పెట్టుకోక పొడి అక్షరాలు పెట్టుకున్నావేంరా నాయనా !

[ఆనందంతో వ్యాసాన్ని చూసుకుంటున్న రాజు తల పంకిస్తాడు. తల్లి అతని ముఖాన్ని గమనిస్తూ యిదివరకు ధోరణిలోనే]

నువ్వింత పత్రికల్లో వ్యాసాలు అవీ రాస్తావని నే నెన్నడూ అనుకోలేదురా నాయనా ! అందుకే గాబోలు ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వాడావిడిగా వుంటాడు అనుకుంటున్నా నిప్పుడు. ఇందాక రవణ వచ్చినప్పుడు, నీ తెలివితేటలను గురించి ఎంత గొప్పగా మాట్లాడాడో చెప్పలేను. ఆ కుర్రాడొక డురా బంగారంలాంటి కుర్రాడు. నన్ను తన తల్లిగా గౌరవిస్తాడు.

(రాజుకి ఏమేమో ఆలోచనలొచ్చి బాధ కల్గిస్తాయి. పత్రిక చదవ కుండా శూన్యంలోకి చూస్తూ వుండిపోతాడు. మొహం ఏదో బాధతో వికృతంగా అయిపోతుంది. చేతిలోని పత్రిక నేలమీదికి జారిపో తుంది. శాంతమ్మ వెంటనే పత్రికను పసిబిడ్డలా చేతిలోకి తీసు కుంటుంది.)

రాజు:- అమ్మా -(చెప్పలేకపోతాడు)

శాంత:- ఏమిటి నాయనా! నే నేదో అతిగా మాట్లాడు తున్నా-విసుక్కోకు బాబూ! నే నిప్పుడే వెళ్ళిపోతా!

రాజు:- (ఓ నిశ్చయానికొచ్చి) నే నొక్కటి అడుగుతా చెప్పమ్మా. నన్ను గురించి నువ్వేం విన్నా, నేను నిన్ను వదలి ఎంత దూరంగా వెళ్ళిపోవాల్సి వచ్చినా నన్నిట్లాగే చూసుకుంటావా అమ్మా?

శాంత:- ఏమిట్రా, ఆ ప్రశ్నేమిట్రా? లోకులు కాకులు—— ఎవరేమనుకుంటే నాకేం-నీ సంగతి నాకు తెలియదా? అయినా నువ్వు దూరంగా వెళ్ళడమేమిటి? నిజంగా నేనా?

రాజు:- అవునమ్మా - నిజంగానే.

శాంత:- తిండీ తిప్పలూ సరిగాలేక యిప్పటికే ఎట్లా అయి పోయావో చూడూ. నేనూ వస్తా నీతో. నీకు తిండి సరిగా అమరేక, నేను తిరిగి వచ్చేస్తా.

రాజు:- కాదమ్మా! చాలా దూరం అది నువ్వు రావడానికి వీల్లేదు. నే నొక్కణ్ణే వెళ్ళాలి. ఇవ్వాళే వెళ్ళాలి.

శాంత:- (ఆశ్చర్యంతో) ఇవ్వాళనేనా?

రాజు:- అవునమ్మా! ఇవ్వాళనే. (లేస్తాడు)

శాంత:- (పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకొని) ఇప్పుడే- ఇప్పుడే వెళ్తున్నావా?

రాజు:- అవునమ్మా-ఇవ్వాళే-ఇప్పుడే!

(జాలిగా ఒక్క క్షణం తల్లివైపు చూసి, అకస్మికంగా తల్లిని కౌగలించు కుని)

అమ్మా!

శాంత:- (కళ్ళంబడి నీరు కారుతుండగా; తల నిమురుతూ తలని ముద్దుపెట్టుకుని) రాజూ! నా వెర్రి రాజూ! చిన్నప్పుడు యిట్లాగే కౌగలించుకుని నీ బాధను చెప్పుకొనేవాడివి. కానీ యిప్పుడు-యిప్పుడు (రాజు ఎడంగా జరుగుతాడు) నువ్వు పెద్దవాడివి. నీ మంచి చెడ్డలు నీకు తెలుసు. చిన్నప్పటిలాగ నా మాటలు నిన్ను ఓదార్చలేవు.

రాజు:- ఇంక నువ్వు వెళ్ళిరా అమ్మా!

శాంత:- నువ్వెంత దూరం వెళ్ళినా, ఎన్నాళ్ళున్నా, అప్పుడప్పుడు వుత్తరాలు రాస్తానని మాట యివ్వు.

రాజు:- వీలుంటే తప్పక రాస్తానమ్మా!

శాంత:- (సంతోషంతో స్మరించుకుంటూ) తప్పక రాస్తాడు. (వెళ్ళి పోతూంటుంది.)

రాజు:- అమ్మా!

శాంత:- (నిలబడి వెనక్కి తిరిగి చూస్తుంది.)

రాజు:- నేనెక్కడున్నా, రమణ నిన్ను చూస్తూంటాడు. నేను లేని లోటు వాడు ఏ మాత్రం కన్పడనీయడమ్మా.

(శాంతమ్మకి దుఃఖం పొర్లుకు రాగా, ముఖాన్ని చెంగుతో కప్పుకుని నిలబడలేక ఏడుస్తూ వెళ్ళిపోతుంది. రాజువిషాదంగా చూస్తూ అక్కడే నిలబడి పోయి వుంటాడు. ఇంతలో బయటనుండి హాలులోకి ఆచారి, కల్పన వస్తారు. కల్పన ముఖం వాడిపోయి వుంటుంది. ఆమె చేతిలో భాగవతం వుంటుంది.)

రాజు:- లోపలికి రా కల్పనా! (కల్పన రాజు గదిలోకి వస్తుంది. ఆచారి సందులోకి వెళ్ళిపోతాడు.) చిట్టి వాళ్ళను ఏం చేశావు?

కల్పన:- (దుఃఖాన్ని దిగ మింగుకుని) అనాధ శరణాలయం సెక్రటరీట—ఆయన వాళ్ళను చూస్తానని తీసుకున్నారు. పోనీలెండి— వాళ్ళక్కడన్నా సుఖిస్తారు.

రాజు:- (ఒక్కక్షణం ఏవేవో ఆలోచనలు అతన్ని బాధిస్తాయి చివరికి నిట్టూర్చి) నేను అలసిపోయా కల్పనా! ఇంకే మాత్రం యీ అశాంతిని, వేదనని సహించలేను. ఆఖరికి జైల్లోనయినా నాకు శాంతి దొరుకుతుందేమో—— (కల్పనకి కళ్ళనీరు తిరుగుతుంది. అది గమనించి) ఇది నువ్వు చెప్పిన సలహాయేగా కల్పనా? ఎందుకట్లా కళ్ళనీరు పెట్టుకుంటావు! (కొంచెం ఆగి) నేను పోలీసు స్టేషన్‌కి వెళ్తున్నా!

కల్పన:- (చకితురాలై) ఏమిటి? ఇప్పుడేనా!

రాజు:- అవును. ఇప్పుడే! నువ్వు నాకు జ్ఞానోదయం కల్గించావు. అందుకు నేను నీకు సర్వదా కృతజ్ఞుణ్ణి. ఇక నన్ను పోనీ.

కల్పన:- (అడ్డుగా నిలబడి) ఉండండి.

రాజు:- నా దోవకి అడ్డులే కల్పనా! నన్నెవరూ యింక ఆపలేరు.

(కల్పనను నెమ్మదిగా ఓ ప్రక్కకు తోసి, గదిలోంచి హాలులోకి వెళ్తూంటాడు.)

కల్పన:- (అతని వెనకే గుమ్మంవరకు వచ్చి) నడవండి—— నేనూ మీతో వస్తాను. నేనూ నా పాపాలకి శిక్ష అనుభవిస్తాను.

రాజు:- (హాలు మధ్యలోనే ఆగిపోయి) నువ్వా! నాతోనా! నీకేం వెర్రా? నీ స్థానం యీ సమాజంలో కల్పనా! నా స్థానం మాత్రం యీ సమాజానికి అవతల. నువ్విక్కడే వుండాలి కల్పనా!

[కల్పనకి మళ్ళీ కన్నీరు తిరుగుతుంది. గుమ్మంలోనే స్థబ్దులా నిలబడి పోతుంది. రాజామెను చూడలేక ముఖాన్ని ప్రక్కకు తిప్పేసుకుని మరో రెండడుగులు వీధివైపుకు వేస్తాడు. లోపల్నుంచి ఆచారి వైలన్ మీద ఏదో తత్వం వాయించసాగుతాడు.)

రాజు:- (శూన్యంలోకి చూస్తూ) ఆచారీ! పోలయ్యా! సూరన్నా! అంతా - అంతా యిట్లా రండి.

(నెమ్మదిగా సత్రంలోని జనం హాలులోకి వచ్చి చేరతారు. వింతగా చూస్తూంటారు.)

కాబూలీఖాన్‌ని, వీరభద్రాన్ని నేనే హత్య చేశాను. ఈ హత్యలకి మరెవ్వరూ బాధ్యులుకారు. నేనే బాధ్యుణ్ణి!

(లోపల్నుంచి ఆచారి వైలన్ తార స్థాయి నందుకుంటుంది. జనంలో గుస గుసలు. రాజు నెమ్మదిగా బయటికి వెళ్ళిపోతాడు. కల్పన గుమ్మాన్ని ఆనుకుని, పసి పిల్లలా ఏడుస్తూ, చేతిలోని భాగవతాన్ని చెక్కిళ్ళకు అదుముకుంటుంది. కన్నీరు భాగవతాన్ని తడుపుతూ వుండగా)

[ క ర్టె న్ ]

స మా ప్తం.

